# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక ఇంద్రజాలం, చిత్ర కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు - విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.






# జానకి లక్స్

## టాయిలెట్ సబ్బును వాడుచున్నది

"అది నాకు తెలిసియున్నట్టి అతి తెల్లని. అతి శుద్ధమైన సబ్బు"

చలన చిత్రములందు విజయమును నిలుపుకొనుటకు కేవలం ఫిలుములందు పని చేయుటే చాలదు అని జానకి ఎరుగును. ఉదాహరణకు, ఆమె తన కోమలమైన చర్మ సౌందర్యముపట్ల చాల శ్రద్ధవహించును. ఆమె ఎల్లప్పుడూ లక్స్ టాయిలెట్ సబ్బును వాడుటవల్ల దాని మనోహరత్వమును నిలుపుకొనును.

ఎంతో తెల్లనిది, ఎంతో శుద్ధమైనది — లక్స్ టాయిలెట్ సబ్బు రూఢిగా చర్మ సౌందర్యమును కాపాడునట్టిది.

అతి సుందరమైన సినీమా తారలు దీనినే వాడుదురు. కనుక మీరున్నూ వాడుడు:

# లక్స్ టాయిలెట్ సబ్బు

సినీమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

LTS. 514-50 TL



ఆరోగ్యవంతులైన జనులు
ప్రతిరోజూ
లైఫ్‌బాయ్ సబ్బుతో
స్నానము చేయుదురు
- అది ప్రతిదిన * మలినములోని
క్రిములను కడిగివేయును !
* మనకు ప్రతిదినం
తార్సపడే మామూలు
మురికిలో క్రిములున్నాయి.
మనలో ప్రతివారికీ యీ క్రిముల
వల్ల రోగాల ప్రమాదం వుంది.
అందుచేతనే చాలమంది ఆరో
గ్యవంతులగు జనులు
లైఫ్‌బాయ్ సబ్బుతో మురికిని
మరియు క్రిములను రోజూ
కడిగివేసుకొనుటవల్ల
తమ ఆరోగ్యమును
కాపాడుకొనుచు
న్నారు — అది
ఆరోగ్యవంతమైన
హాయిని
గలిగించును.
LIFEBUOY SOAP
LIFEBUOY SOAP

విజయ వారి

# మాయా బజార్

డైరెక్షన్....కె. వి. రెడ్డి, B.Sc.(HONS)



నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి

స్టూడియో.... వాహిని




నాగేశ్వర రావు · రంగా రావు · రేలంగి · నాగయ్య · సూరిబాబు
వరలక్ష్మి · సూర్యకాంతం · ఋష్యేంద్రమణి · సూర్యకళ · సీత..

A.K. GOPAL

# ఇప్పుడు

## కొత్తరకపు

# టాయిలెట్ పౌడరు

## ఎల్లవేళలందును హాయిగా నుంచుటకు

భారతదేశమందు ప్రప్రథమంగా, లోకప్రసిద్ధమైన **జి-11**※ తో గూడినట్టి అతిసున్నితమైన టాల్కమ్ పౌడరు తయారుచేయబడినది....జి-11 చర్మ మచ్చలను అత్యధిక చమటను గలిగించు క్రిములను నాశనమొనర్చునట్టి ఒక్కటే ధృవపడిన మంట బెట్టని రసాయనము. ఈ అద్భుతమైన పౌడరు చర్మము తడివల్ల రేగుట, వేడికి పేలుట ఈ బాధలనుండి శాశ్వతమైన శ్రమవిముక్తిని గలిగించును.....

ఎల్లప్పుడూ, పనికి, ఆటలకు, షికారుకు, విందులకు వెళ్లేముందు ఈ శమనకరమైన, మనోహరమగు పరిమళము గల పౌడరును బాగా అద్దుకొనుడు....మీరు మిగుల నమ్మికగా నుందురు, చాలా ప్రీతికరముగా నుందురు! బట్టలయందు జల్లబడేయడల, అది రాపిడిని నిరోధించును.

Godrej
రిజిస్టర్డ్

జి-11 తో గూడిన

# గోద్రెజ్

# టాయిలెట్ పౌడరు




**జి-11** తో కూడిన
హెయిర్ టానిక్కు
షేవింగ్ స్టిక్కు
సింతాల్

※ వైజ్ఞానిక గ్రంథ జాబితాతో గూడిన **జి-11** గాథ (హెక్సాక్లోరోఫీన్) కొరకు, దిగువ చిరునామాకు వ్రాయుడు. గోద్రెజ్ సోప్స్ ప్రయివేట్ లిమిటెడ్, బొంబాయి-11.



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

దౌర్జన్యానికి తలఒగ్గటంవల్ల అది మరింత పెచ్చు పెరుగుతుందిగాని సౌజన్యంగా మారదు. కాని స్వార్థపరులైనవారు ఏదో విధంగా దౌర్జన్యంతో రాజీపడటానికి యత్నిస్తారు; తమ్ము తాము రక్షించుకొనే ఉద్దేశంతో ఇతరులను ఆ దౌర్జన్యానికి బలి చేస్తారు. ఈ విధంగా చేయటంవల్ల దౌర్జన్యం తమపట్ల కనికరిస్తుందని వారి భ్రమ. ఇది ఎంతోకాలం సాగదు. చివరకు దౌర్జన్యం వారి పీకల మీదికి రానే వస్తుంది.

"పాపిష్ఠి జన్మ" [జాతక కథ]లో రాజు బ్రహ్మరాక్షసినుంచి తన ప్రాణాన్ని రక్షించుకోవటానికిగాను తన రాజ్యంలో ఉండే ఖైదీల నందరినీ బలిపెట్టాడు. కాని కొంతకాలానికి ఖైదీలందరు అయిపోతారు. రాజు పీకమీదికి వస్తుంది. ఆ స్థితిలో రాజు బ్రహ్మరాక్షసికి ఆహారం కావటానికి సిద్ధమైనవారికి వెయ్యి రూపాయలు బహుమాన మిస్తానని చాటింపు వేస్తాడు. కాయకష్టం చేసి కానీ కళ్లచూడలేని స్థితిలో ఉన్న బోధిసత్త్వుడు బ్రహ్మరాక్షసికి ఆహారం కావటానికి ఒప్పుకుని, రాజు చేయలేని పని తానే సాధిస్తాడు: ఆయన బ్రహ్మరాక్షసికి ఆత్మజ్ఞానం కలిగించి దాని దౌర్జన్యాన్ని పోగొట్టి సన్మార్గంలో పెడతాడు!

సంచిక 2

ఫిబ్రవరి 1957

సంపుటి 20

CHITRA

# అట్టమీది బొమ్మ

సత్యవంతుణ్ణి పెళ్ళాడగానే సావిత్రి తన మేలి వస్త్రాభరణాలు విడిచిపెట్టి నార చీరెలు ధరించి, అత్త మామలకూ, భర్తకూ సేవచేస్తూ వనవాసం చెయ్య సాగింది. సత్యవంతుడి చావు ఇంకా నాలుగు రోజులలో ఉన్నదనగా ఆమె మూడు రోజుల కఠిన ఉపవాసవ్రతం పూనింది. మూడు రోజుల వ్రతమూ పూర్తి అయినాక నాలుగవ రోజు ఆమె భోజనం చెయ్యలేదు.

ఆ రోజు సత్యవంతుడు పూలూ, కట్టెలూ తీసుకురావటానికి అడవిలోకి పోతూంటే సావిత్రికూడా అతనివెంట బయలుదేరింది. అడవిలో సత్యవంతుడు పూలూ, పళ్లూకోసి, కట్టెలు కొడుతూ మధ్యలో గొడ్డలి జారవిడిచి, తనకు తల నొప్పిగా ఉన్నదనీ, కొంచెంసేపు విశ్రాంతి తీసుకుంటాననీ సావిత్రిదగ్గిరికి వచ్చాడు. అతని తల తన తొడమీద పెట్టుకుని సావిత్రి కూర్చుని ఉండగా ఆమె ఎదట యమధర్మరాజు కనిపించాడు.

యముడు తన భర్త ప్రాణాలను పాశంతో బంధించి తీసుకుపోతూండటం కళ్లారాచూసి సావిత్రి ఆయనను వెంబడించింది. యముడు ఆమెను తిరిగి పొమ్మన్నాడు, కాని ఆమె ఒప్పుకోలేదు. ఆమె తనవెంట రాకుండా ఆపటానికి యముడు ఆమెకు వరసగా అనేక వరాలిచ్చాడు. సావిత్రి మామగారికి కళ్లు తిరిగివచ్చేటట్టూ, ఆయనకు రాజ్యం తిరిగివచ్చేటట్టూ, సావిత్రి తండ్రి అయిన అశ్వపతికి నూరుగురు కొడుకులు కలిగేటట్టూ యముడు వరాలిచ్చాడు. అప్పటికీ సావిత్రి ఆయనను వెంబడించటం మానలేదు. ఆఖరుకు యముడు సావిత్రికి నూరుగురు కొడుకులు కలిగేలాగు వరమిచ్చాడు. భర్త పోయాక పతివ్రత పిల్లల్ని ఎలా కంటుందని సావిత్రి యముణ్ణి అడిగింది. యముడు చేసేదిలేక తన పాశంనుంచి సత్యవంతుడు ప్రాణాలు తప్పించి ఆమెకు భర్తృ దానం చేశాడు.

సావిత్రి సత్యవంతుడి వద్దకు తిరిగివచ్చేసరికి అతను నిద్రలేచిన వాడి లాగా లేచి కూర్చున్నాడు. తరవాత వారిద్దరూ కలిసి ఆశ్రమానికి తిరిగివచ్చారు.

యముడి వరాలప్రభావంచేత సావిత్రి మామగారికి కళ్ళువచ్చాయి, పోయిన రాజ్యంకూడా లభించింది. అతడికి కుమారులు కలిగారు. సత్య వంతుడు సాళ్వదేశానికి రాజై చాలాకాలం పాలించాడు.




బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు సుతనుడనే పేరు గల పేద గృహస్థుగా జన్మించాడు. అతను పెరిగి పెద్దవాడై తన సంపాదనతో తల్లి దండ్రులను పోషిస్తూ వచ్చాడు. కొంత కాలానికి సుతనుడి తండ్రి చనిపోయాడు. తల్లి మాత్రం మిగిలింది. రోజల్లా శ్రమ పడినా తనకూ, తన తల్లికీ చాలినంత సంపాదించలేక సుతనుడు చాలా ఇబ్బంది పడుతూ ఉండేవాడు.

ఆ దేశపు రాజుగారికి వేటయందు చాలా ప్రీతి. ఆయన తరుచు అడవికి వెళ్లి అక్కడ అడవిజంతువులను వేటాడుతూ ఉండేవాడు. ఒకనాడు రాజుగారు ఒక లేడిని తరుముతూ అడవిలో చాలా దూరం వెళ్ళి, ఎలాగైతేనేం దాన్ని బాణంతో కొట్టాడు. లేడి బాణం దెబ్బకు చచ్చి పడిపోయింది. సమీపంలో రాజుగారి భటులెవరూ లేరు. అందుచేత రాజే ఆ లేడిని భుజాన వేసుకుని తిరిగి రాసాగాడు.

మిట్టమధ్యాహ్నం ఎండ మండి పోతున్నది. వేటమూలంగానూ, లేడిని మోసుకు వస్తూవుండటం వల్లనూ రాజు చాలా డస్సిపోయి ఉన్నాడు. అటువంటి స్థితిలో ఆయనకు ఒక విశాలమైన మర్రిచెట్టు నీడ చల్లగా కనిపించింది. రాజు లేడి శరీరాన్ని నీడలో పడేసి, విశ్రాంతి తీసుకోవటానికి తానుకూడా చతికిలబడ్డాడు.

మరుక్షణమే రాజు ఎదట ఒక బ్రహ్మ రాక్షసి ప్రత్యక్షమై, "నిన్ను తినేస్తాను!" అంటూ మీదికి రాసాగింది.

"ఎవరు నువు? నన్ను తినటానికి నీకేమి అధికారం ఉన్నది?" అని రాజు బ్రహ్మరాక్షసిని అడిగాడు.

"ఈ చెట్టు నాది. దీని నీడలోకి ఎవరైతే వస్తారో, ఈ చెట్టుకింద ఉండే నేలమీద





చేస్తాను. నేను ఈ దేశానికి రాజును. అందుచేత నీకు రోజూ అన్నంతోపాటు, ఒక మనిషిని పంపగలను," అన్నాడు రాజు.

ఈ మాట విని బ్రహ్మరాక్షసి చాలా సంతోషించింది.

"అలా అయితే నిన్ను విడిచిపెడతాను. కాని ఏ రోజు నాకు వేళకు ఆహారం రాక పోయినా, నేనే బయలుదేరి వచ్చి నిన్ను తినేస్తాను!" అన్నది బ్రహ్మరాక్షసి.

రాజుగారు లేడిని బ్రహ్మరాక్షసికి ఇచ్చేసి, తన రాజధానికి తిరిగి వచ్చి, తన మంత్రితో జరిగినదంతా చెప్పాడు.

ఎవరైతే కాలు పెడతారో వారినెల్లా తిన టానికి నాకు హక్కున్నది. నేను బ్రహ్మ రాక్షసిని," అన్నదా భూతం.

రాజు దీర్ఘంగా ఆలోచించాడు. చివర కాయన బ్రహ్మరాక్షసితో, "నువు ఈనాడు మాత్రమే తిండి తింటావా? లేక రోజూ నీకు ఆహారం కావాలా?" అని అడిగాడు.

"నాకు రోజూ ఆహారం కావాలి," అన్నది బ్రహ్మరాక్షసి.

"అయితే, ఈపూట నన్ను తినటంవల్ల నీ ఆహారసమస్య తీరదు. ఈ పూటకు ఈ లేడిని తిని నన్ను వదిలేశావంటే నీకు ఏ రోజూకూడా ఆహారసమస్య లేకుండా

"మహారాజా, మీరేమీ విచారించకండి. మన ఖైదులో చాలామంది నేరస్థు లున్నారు. వారిని రోజుకొకరు చొప్పున బ్రహ్మరాక్షసికి ఆహారంగా పంపుతాను!" అన్నాడు మంత్రి.

అదిమొదలు మంత్రిగారు రోజు కొక ఖైదీని అడవిలో ఉన్న మర్రిచెట్టు వద్దకు అన్నంతోసహా పంపటమూ, బ్రహ్మరాక్షసి ఆ ఖైదీని తినటమూ జరుగుతూ వచ్చింది.

కొంతకాలానికి ఖైదీలందరూ అయి పోయారు! ఏమి చెయ్యాలో మంత్రిగారికి పాలుపోలేదు. అయన రాజ్యమంతటా చాటింపు వేయించాడు:





"ఎవరైతే అన్నం తీసుకుని అడవిలో ఉండే దయ్యాల మర్రివద్దకు పోతారో వారికి రాజుగారు వెయ్యి రూపాయలు బహుమానం ఇస్తారు!"

ఈ చాటింపు విని సుతనుడు, "ఏమి ఆశ్చర్యం! నేను ఎంత కష్టపడి పనిచేసినా రాగి డబ్బులు తప్ప కళ్ళబడవే, బ్రహ్మ రాక్షసికి ఆహారమైతే ఇంత డబ్బిస్తారా?" అనుకున్నాడు.

అతను తన తల్లితో, "అమ్మా, నేను వెయ్యి రూపాయలు తీసుకుని దయ్యాల మర్రివద్దకు అన్నం పట్టుకు పోతాను. ఆ డబ్బుతో నీకు చాలా సుఖంగా జరిగి పోతుంది!" అని చెప్పాడు.

"నాకిప్పుడేం తక్కువయిందిరా? నేను సుఖంగానేవున్నాను. నువు ఎక్కడికీ వెళ్ల నవసరం లేదులే!" అన్నది సుతనుడి తల్లి.

"నాకే అపాయమూ రాదు! నేను క్షేమంగా తిరిగివస్తే సరిగదా!" అని సుతనుడు తల్లిని ఒప్పించి రాజువద్దకు వెళ్లాడు.

"మహారాజా, మీ పాదరక్షలూ, గొడుగూ, కత్తీ, ఒక బంగారు పాత్రం ఇప్పించినట్టయితే నేను అడవిలో ఉండే దయ్యాల మర్రివద్దకు ఆహారం తీసుకుపోతాను," అని సుతనుడు రాజుగారితో అన్నాడు.



"అన్నం పట్టుకుపోవటానికి ఇవన్నీ ఎందుకు?" అని రాజుగారు అడిగాడు.

"బ్రహ్మరాక్షసిని ఓడించటానికి!" అని సుతనుడు సమాధానం చెప్పాడు.

తరవాత సుతనుడు కత్తి ధరించి, పాదరక్షలు తొడుగుకుని, గొడుగు వేసుకుని, బంగారు పాత్రలో అన్నం తీసుకుని మధ్యాన్నానికి దయ్యాల మర్రిదగ్గిరికి వెళ్లాడు. అతను చెట్టు నీడ లోపలికి రాక, ఎడంగా గొడుగు నీడలో నిలబడ్డాడు.

అతనికోసం చూస్తున్న బ్రహ్మరాక్షసి, "ఎండలో పడి చాలా దూరం వచ్చావు. నీడలోకివచ్చి, విశ్రాంతి తీసుకో!" అన్నది.





# నక్క సవారీ

అరణ్యరాజ్యంలో, ఒకనాడు కుందేలు దుప్పిగారి ఇంటికి వెళ్ళింది. దుప్పీ, దుప్పి భార్యా, పిల్లలూ కుందేలుతో కుశల ప్రశ్నలు చేసి, "ఈ మధ్య నక్కను నువు చాలా ఇబ్బందులు పెట్టావుటగా? నీ పని పట్టిస్తా నని నక్క అంటున్నది. కొంచెం జాగ్రత్తగా ఉండటం మంచిది!" అన్నాయి.

కుందేలు నవ్వి, "ఈ నక్కను నేను లక్ష్య పెడతానా? ఇది మా నాన్నకు ముప్పై ఏళ్లపాటు వాహనంగా ఉండేది!" అన్నది.

మర్నాడు నక్క దుప్పిగారింటికి వెళ్లి నప్పుడు, దానికి కుందేలు అన్నమాటలు తెలిశాయి. నక్క పళ్లు పటపటాకొరికి, "ఈ కుందేలు తండ్రికి నే నెప్పుడు వాహనంగా పనిచేశానో మీ ఎదటే చెప్పిస్తాను!" అంటూ లేచి, నేరుగా కుందేలు ఇంటికి వెళ్లింది.

నక్క వస్తుందని కుందేలు అను కుంటూనే ఉంది. అందుచేత అది తలుపు గడియపెట్టి లోపల కూచున్నది. నక్క వచ్చి తలుపుమీద రెండు మూడుసార్లు దబదబా కొట్టినాక, కుందేలు బలహీనమైన గొంతుపెట్టి, "ఎవరు వారు? నక్కబావా ఏమిటి?" అని మూలిగింది.

"నేను నీ కోసమే వచ్చాను. వెంటనే తలుపు తియ్యి!" అన్నది నక్క.

"అయ్యో, నక్కబావా! నాకు చాలా జబ్బుగా ఉంది. వైద్యుణ్ణి పిలుచుకు వస్తావా?" అన్నది కుందేలు.

"ఇప్పుడు వీలులేదు. దుప్పిగారింటో ఇవాళ విందు. నిన్ను వెంటనే తీసుకు రమ్మని నన్ను పంపారు. ఆలస్యంచెయ్యక బయలుదేరు!" అన్నది నక్క.

"అయ్యో, నేను కాలు కదపలేనే! ఎట్లా వచ్చేది?" అన్నది కుందేలు.

"నేను పట్టుకు నడిపిస్తాలే, రా!" అన్నది నక్క.

టి. శంభుదాసు




## 2

[అవంతీనగరంలో ముగ్గురు అన్నదమ్ములుండేవారు. చిన్నవాడైన పింగళుడు చేపలు పట్టేందుకు చిలకసరస్సుకు వెళ్లాడు. అక్కడికి మండనుడు అన్నవాడొకడువచ్చి, తనను సరస్సులో కట్టి పడవేయవలసిందిగా కోరాడు. పింగళుడు అలాగేచేసి, పట్టణానికివెళ్లి కాంచనమిశ్రుడు అనే వర్తకుడిదగ్గిర నూరుమొహరీలు పుచ్చుకున్నాడు. తరవాత—]

కాంచనమిశ్రు డిచ్చిన నూరు మొహరీలు తీసుకుని, పరమానందంతో పింగళుడు దుకాణంవాడి దగ్గిరకు వెళ్ళాడు. దుకాణంవాడు, పింగళుణ్ణి చూస్తూనే అతడు ఉత్సాహంగా వున్నట్టు గ్రహించి, "ఏం పింగళా, ఇవ్వాళ అదృష్టం తిరిగినట్టుంది! చాలా చేపలు పట్టినట్టున్నావే?" అన్నాడు.

పింగళుడికి అప్పటి ఉత్సాహంలో తను నూరు మొహరీలు ఏ విధంగా సంపాదించిందీ దుకాణంవాడితో చెప్పాలనిపించింది. కాని, వెంటనే అతడికి కాంచనమిశ్రుడు చేసిన హెచ్చరిక గుర్తుకువచ్చి, "పదిరోజుల తరవాత, ఇవ్వాళే వలలో తిరిగి చేపలు పడినై. ఈ గడిచిన పదిరోజులూ ఏదో దురదృష్టదేవత నన్ను వెన్నాడినట్టుంది," అన్నాడు విచారంగా.

తరవాత పింగళుడు, ఆనాటివరకూ దుకాణంవాడికి యివ్వవలసిన డబ్బంతా లెక్కచూసి ఇచ్చి, తనకు కావలసిన సామానులు తీసుకుని ఇంటికి వెళ్ళాడు. అతడు ఇంటికి వెళ్ళేసరికి అన్నలిద్దరూ గోడనానుకుని, కునికిపాట్లు పడుతూ కని



పించారు. తల్లి ఎదురువచ్చింది. పింగళుడు తను దుకాణంనుంచి తెచ్చిన సామానులు తల్లికి ఇచ్చి, "ఇవ్వాళ అదృష్టం కలిసివచ్చింది. త్వరగా వంటపనులు పూర్తిచెయ్యి," అన్నాడు.

కొద్దిసేపటిలోనే తల్లి భోజనం తయారు చేసింది. పింగళుడితోపాటు జీవదత్తుడూ, లకదత్తుడూ కూడా త్వరత్వరగా భోజనం చేసి, ఉల్లాసంగా బయటికి వెళ్ళిపోయారు. అన్నలు అటు వెళ్ళగానే పింగళుడు జేబులోంచి మొహరీలుతీసి, తల్లికి చూపించాడు.

తల్లి మొహరీలు చూస్తూనే ఆశ్చర్యపడి, "ఇంత డబ్బు ఎలా సంపాయించావ్?" అని అడిగింది. పింగళుడు ఏమీ దాచకుండా జరిగినదంతా తల్లికి చెప్పాడు.

ఆమె అంతా విని, "పింగళా! నువ్వు చేసిన పని మరెవరికైనా తెలిస్తే చాలా ప్రమాదం కలుగుతుంది. ఇకమీదట నువ్వు చిలకసరస్సు ప్రాంతాలకు వెళ్ళకు," అన్నది భయపడుతూ.

తల్లి భయం చూసి, పింగళుడు నవ్వి, "నేను చేసింది నేరం ఎలా అవుతుంది? ఆ వచ్చినవాడు కావాలని కోరి చేతులు విరిచికట్టించుకుని, సరస్సులో మునిగి చచ్చాడు. అయినా ఈ సంగతి మరెవరికీ తెలియకుండా దాయవచ్చు," అన్నాడు.

"నీ అన్నల సంగతి తెలుసుగదా? వాళ్లు మంచివాళ్లు కాదు. వాళ్ళ చెవిని పడకుండా ఉంచు," అన్నది తల్లి.

పదిరోజుల తరవాత పింగళుడికి, ఆ రాత్రి హాయిగా నిద్రపట్టింది. అతడు మరునాడు తెల్లవారుతూనే వల తీసుకుని, చిలక సరస్సుకు వెళ్ళాడు. అతడు సరస్సులో మిట్టమధ్యాహ్నంవరకు వల వేసినా, ఒక్క చేప అయినా పడలేదు. అతడు నిరుత్సాహపడి, ఇక ఇంటికి వెళదామా అనుకునేంతలో, అల్లంత దూరాన వేగంగా వస్తున్న గుర్రపు రౌతు కనిపించాడు.



పింగళుడు అదిరిపడ్డాడు. గుర్రంమీద వస్తున్న వ్యక్తి అచ్చుగా నిన్న వచ్చిన మండనుడిలాగానే ఉన్నాడు. సరస్సులో మునిగి పోయినవాడు పిశాచమై రావటంలేదుగదా? అనిపించింది పింగళుడికి. అంతలో గుర్రం అతన్ని సమీపించింది. రౌతు నవ్వుతూ గుర్రంమీంచి దిగి, "పింగళా, నీనుంచి నాకో సహాయం కావాలి!" అన్నాడు.

పింగళుడు, భయపడుతూనే అతడికేసి చూశాడు. ఈ వచ్చినవాడు పోలికకు మాత్రం మండనుడిలాగానే ఉన్నాడు. కాని వయసులో మాత్రం అతడికన్న కొంచెం చిన్నవాడులా కనిపించాడు. గుర్రం కూడా మరో రంగుది. దానితో పింగళుడికి ఈ వచ్చింది పిశాచం కాదని తెలిసి, కొంత ధైర్యంకలిగింది.

"నా పేరు మీకెలా తెలుసు? నానుంచి మీకు కావలిసిన సహాయం ఏమిటి?" అని అడిగాడు పింగళుడు.

ఈ ప్రశ్న వింటూనే రౌతు పెద్దగా నవ్వి, "పింగళా! నీ పేరు నాకెలా తెలుసో, నే వచ్చిన పనేమిటో నీకు తెలియండికాదు. నా పేరు అనురూపుడు. నీ సహాయం కోరిన మండనుడు నా సోదరుడే. నాకూ నీనుంచి అలాంటి సహాయమే కావాలి," అన్నాడు.




"మండనుడు మీ సోదరుడా? ఆయన ఎక్కడున్నాడు?" అని అడిగాడు పింగళుడు.

అనురూపుడు పొట్ట చెక్కలయ్యేలా నవ్వి, సరస్సు మధ్యకు చేయి చూపుతూ, "బహుశా, మండనుడు అక్కడ వుండి వుంటాడు. లేక యీ సరికి జలచరాలకు ఆహారమయినా అయివుండొచ్చు," అన్నాడు.

"అయితే, నిన్న ఇక్కడ జరిగిందేమిటో అంతా మీకు తెలుసునన్నమాట?" అని ప్రశ్నించాడు పింగళుడు.

"అవును. సర్వం నాకు తెలుసు. నీనుంచి నాకూ్కడా సహాయం కావాలి," అన్నాడు అనురూపుడు.






"చేస్తాను. కాని, నా సహాయానికి యీ సారి రెండు వందల మొహరీలు ఇవ్వవలసి వుంటుంది." అన్నాడు పింగళుడు.

అనురూపుడు పెద్దగా నవ్వి, పింగళుడి భుజం తడుతూ, "అవును, నువ్వు రెండు వందల మొహరీలు అడుగుతావేమో అని నాకు ముందే అనుమానం కలిగింది. అందుకే కాంచనమిత్రుడిదగ్గిర ఆ ఏర్పాటు చేసే వొచ్చాను. కాని నేను సరస్సునుంచి ప్రాణాలతో బయటపడనని నీ కెందుకు నమ్మకం కలగాలి?" అన్నాడు.

తరవాత పింగళుడు తాడు తీసుకుని అనురూపుడి చేతులు వెనక్కు విరిచికట్టి,



అతణ్ణి భుజానవేసుకుని సరస్సు ఒడ్డుమీది నుంచి లోపలకు విసిరివేశాడు. అనురూపుడు సరస్సులో పడబోయే ముందు, "పింగళా, నా తల ముందు నీటిమీద తేలితే, వెంటనే వలవేసి బయటికి లాగు సుమా!" అంటూ కేకవేశాడు.

పింగళుడు సరస్సు ఒడ్డునే వల తీసుకుని సిద్ధంగా వున్నాడు. సరస్సులో కొంచెం సేపు అలలు లేచి తగ్గిపోయినై. ఒకటి, రెండు నిమిషాల తరవాత నీటిమీద చిన్న బుడగలు లేచి, అనురూపుడి కాళ్ళు ముందుగా పైకి తేలినై.

"చచ్చిపోయాడు, పాపం!" అనుకుని పింగళుడు అనురూపుడి గుర్రాన్ని ఎక్కి, వెనక్కు తిరిగి చూడకుండా పట్టణంలోకి వెళ్ళాడు. కాంచనమిత్రుడు అతణ్ణి అంత దూరాన చూస్తూనే, "దురాశ దుఃఖంచేటు" అంటూ బిగ్గరగా అరిచి, పింగళుడికి రెండు వందల మొహరీలు లెక్కపెట్టి ఇచ్చాడు.

"దురాశ ఎవరిది? నాదా? ఈ రెండు వందల మొహరీలకోసం నేనెంత శ్రమ చేస్తున్నానో మీకు తెలుసా?" అన్నాడు పింగళుడు, కాంచనమిత్రుడితో.

ఆ మాటలకు కాంచనమిత్రుడు అయిష్టంగా తల వూపి, "దురాశ నీదికాదు, ఆ





చనిపోయిన వాళ్ళది. నువ్వు చేస్తున్న పని ఏమిటో బయటపడితే, నీకు కలగబోయే ప్రమాదం ఊహించటం ఏమంత కష్టం కాదు. నీలోనూ దురాశ తలచూపుతున్నది. నిన్న వంద మొహరీలు, ఇవ్వాళ రెండు వందల మొహరీలు!" అన్నాడు.

"రేపు మూడు వందల మొహరీలు! అంతకు తక్కువయితే, నేను ఎవరికీ చచ్చేందుకు సహాయం చెయ్యను," అంటూ పింగళుడు ఇంటికి బయలుదేరాడు.

ఆ రాత్రి పింగళుడు, తల్లికి తను తెచ్చిన రెండు వందల మొహరీలూ ఇచ్చాడు. తల్లి ఆ డబ్బు చూస్తూనే భయంతో వణికిపోయింది. "నాయనా! ఇకనైనా నువ్వు ఆ చిలకసరస్సు వైపుకు వెళ్లటం మాను. నాకెందుకనో భయంగా వుంది," అన్నది.

"భయం ఏమీలేదు. నువ్వు ఈ సంగతి మాత్రం ఎవరికీ తెలియకుండా ఉంచు," అన్నాడు పింగళుడు.

ఆ రాత్రి పింగళుడికి సరిగా నిద్రపట్ట లేదు. తెలతెలవారుతూండగానే వల భుజాన వేసుకుని చిలకసరస్సుకు వెళ్ళాడు. అతడు సరస్సులో వలవేసినా దృష్టిమాత్రం మైదానంమీదే ఉంది.



సరిగా మిట్టమధ్యాహ్నంవేళకు మైదానం మీద దుమ్ము రేపుతూ ఒక రౌతు రావటం పింగళుడికి కనిపించింది. అతడు చూస్తూ న్నంతలో రౌతు అక్కడికి వచ్చి, "పింగళా! నా పేరు పద్మపాదుడు. నాకో సహాయం చేసిపెట్టాలి!" అన్నాడు.

"ఓ, సహాయానికేం, చేస్తాను. ఈ సరస్సులో పడి ఆత్మహత్య చేసుకోవాలను కున్న ప్రతి ఒక్కరికీ సహాయపడటమే నా పని. మూడు వందల మొహరీలు ఇవ్వ వలసి వుంటుంది," అన్నాడు.

"దానికేం, నేను చచ్చిపోతే మూడు వందల మొహరీలూ కాంచనమిశ్రుడు





ఇస్తాడు," అంటూ పద్మపాదుడు నవ్వి, గుర్రానికి వేలాడుతున్న తాడు విప్పి పింగళుడి చేతికి అందించాడు.

పింగళుడు తాడు తీసుకుని పద్మపాదుడి చేతులు వెనక్కు విరిచికట్టి, అతణ్ణి భుజాన వేసుకుని, సరస్సు ఒడ్డుకు మోసుకుపోయి, లోపలకు విసిరివేస్తూనే, "పాపం, చచ్చిపోయాడు!" అంటూ వెనుదిరిగి గుర్రం దగ్గిరకు వెళ్ళాడు.

పింగళుడు సరస్సుకేసి చూడనైనా చూడకుండా గుర్రాన్ని ఎక్కి బయలుదేరపోయేంతలో సరస్సులోనుంచి పద్మపాదుడి కేకలు వినిపించినై. "పింగళా, నన్ను త్వరగా వలవేసి బయటికి లాగు, నీకు పుణ్యం ఉంటుంది!" అంటూ అతడు బిగ్గరగా అరవసాగాడు.

పింగళుడు గుర్రందిగి ఒక్క దూకు దూకి, వలవేసి, పద్మపాదుణ్ణి నీటిలోంచి ఒడ్డుకు లాగాడు. పద్మపాదుడు రొప్పుతూ నీటిలోంచి బయటికి వచ్చాడు. అతడి చేతిలో రెండు మొసలిపిల్లలు వున్నాయి. పింగళుడు వాటికేసి ఆశ్చర్యంగా చూసి, ప్రశ్నించబోయేంతలో పద్మపాదుడు గుర్రం దగ్గిరకు వెళ్ళి, దానిమీద ఉన్న సంచీలోంచి ఒక గాజుజాడీ తీసి, దానిలో మొసలిపిల్లలను పడవేసి మూతపెట్టాడు.





పింగళుడు పద్మపాదుడికేసీ, ఆ మొసలి పిల్లలకేసీ ఓమారు అనుమానంగా చూసి, "పద్మపాదా, నువ్వు చాలా అదృష్ట వంతుడివి బ్రతికి బయట పడ్డావ్. సరే, నా మూడు వందల మొహరీల మాటే మిటి?" అన్నాడు.

పద్మపాదుడు ఆప్యాయంగా పింగళుడిని కౌగలించుకుని, "పింగళా! నీకు ఆ మూడు వందల మొహరీలేమిటి...లక్ష... కోటి మొహరీలు ఇస్తాను. ప్రపంచంలో అందరికన్న ధనవంతుణ్ణి చేస్తాను. నువ్వు మాత్రం నావెంట భల్లూకపర్వతాల దగ్గిరకు రావలసి వుంటుంది," అన్నాడు.

"భల్లూకపర్వతాలా? అబ్బో, ఆ పేరంటేనే నాకు భయం. మా అమ్మ వాటిని గురించి చాలాసంగతులు చెప్పింది. ఆ కొండలు పిశాచాలకు నిలయమని విన్నాను," అన్నాడు పింగళుడు.

"ఆ పిశాచాలూ, దయ్యాలూ నిన్నేమీ చెయ్యలేవు. ఈ ప్రపంచంలో ముగ్గురే ముగ్గురు గొప్ప మాంత్రికులున్నారు. వాళ్లల్లో ఇద్దరిని స్వయంగా నువ్వే ఈ సరస్సుకు బలియిచ్చావు. ఇక మిగిలినవాడిని నేను," అన్నాడు పద్మపాదుడు.

"నాకేమీ అర్థంకాలేదు," అన్నాడు పింగళుడు ఆశ్చర్యంగా.





"అలాఅయితే, నీ సహాయం కావలసిన వాణ్ణిగనక సంగతంతా చెపుతాను విను," అంటూ పద్మపాదుడు యిలా చెప్పాడు:

మేం ముగ్గురు అన్నదమ్ములం. మా తండ్రి గొప్ప మాంత్రికుడు. అయన తన మంత్రశక్తివల్ల అనేకులకు మేలూ, కొందరికి కీడూ కూడా చేశాడు. అయన చిన్నప్పటినుంచీ మా అన్నదమ్ముల్లో ఎవరిమీదా పక్షపాతం చూపకుండా, అందరికీ మంత్ర విద్యలో ప్రవేశం కల్పించాడు. అయన పెద్దవాడయి మరణించేముందు ఆస్తిపాస్తులన్నీ మాకు సమానంగా పంచి యిచ్చాడు. కాని అయన తనకు తెలిసిన మంత్రవిద్యనంతా రాసివుంచిన పుస్తకాన్ని మాత్రం మాకెవరికీ ఇవ్వకుండా, 'మీలో ఎవరు శక్తిమంతులైతే, వారికి అది లభిస్తుంది!' అని చెప్పి మరణించాడు.

అయన మరణించిన మరుక్షణంనుంచీ మా అన్నదమ్ముల్లో కలతలు బయలుదేరినై. మాలో ప్రతి ఒక్కరికీ ఆ పుస్తకాన్ని తమదిగా చేసుకోవాలనే కోర్కె పుట్టింది. ఒకరిమీద ఒకరం, మంత్రశక్తి ఉపయోగించుకోవటానికి తయారయ్యాం.

అన్నదమ్ములం ఒకర్ని ఒకరం నాశనం చేసుకునేటందుకు సిద్ధమౌతున్న దశలో మా తండ్రికి మంత్రవిద్య నేర్పిన గురువు మాయింటికి వచ్చాడు. అతడు మా పోట్లాట చూచి, చాలా ఖేదపడ్డాడు. ముగ్గుర్నీ ఒకచోట కూర్చోపెట్టి, 'మీతండ్రి విడిచిపోయిన ఆ పుస్తకాన్నిగురించి, మీకేమీ తెలియదు. అందుకే తగవులాడుకుంటున్నారు. మీలో ఎవరు శక్తిమంతులైతే, వారికి ఆ పుస్తకం లభిస్తుందని మీతండ్రి చెప్పాడుగదా? కనుక, ఆ పుస్తకంలో వున్న మంత్రశక్తులు మీ అధీనం కావాలంటే, ముందుగా మీరు సాధించవలసింది చాలావుంది,' అన్నాడు. అదేమిటో చెప్పమని అయన్ని కోరాం. అయన యిలాచెప్పాడు: (ఇంకావుంది)



# లోభులకు గురువు

పూర్వం ఒక దేశంలో ఒక లోభి ఉండేవాడు. ప్రపంచంలో తనకన్న గొప్ప లోభులింకా ఉన్నారని అతనికి తెలియవచ్చింది. ముఖ్యంగా లోభులకు గురువు అనదగినవాడు ఫలాని దేశంలో ఉంటున్నట్టు విని, ఈ లోభి ఆ గురువు దగ్గిర కొత్త విషయాలు నేర్చుకుందామని బయలు దేరాడు.

అతను చాలా రోజులు కాలినడకను ప్రయాణంచేసి గురువు ఉండే చోటు చేరాడు. గురువు లోభికి ప్రేమపూర్వకంగా స్వాగతమిచ్చి, అతను వచ్చిన పని తెలుసుకుని, "ఆ విషయం తరవాత మాట్లాడదాం. ముందు భోజనం చేద్దాం, బయలుదేరు," అన్నాడు.

ఈ లోభి గురువు తనకు ఆతిథ్యం ఇవ్వటంచూసి లోభికి ఆశ్చర్యం కలిగింది. "మీరేమీ శ్రమపడకండి. నా వెంట ఎండిపోయిన రొట్టెముక్క తెచ్చుకున్నాను," అన్నాడు లోభి.

"నువు నా అతిథివి. నీ భోజనసదుపాయాలు చేసేభారం నాది!" అంటూ గురువు లోభిని బజారుకు తీసుకుపోయాడు. వారు ఒక రొట్టెల అంగడి చేరారు. "మంచి రొట్టె లున్నాయా?" అని దుకాణదారును గురువు అడిగాడు. "ఉన్నాయి, బాబూ, వెన్నలాటి రొట్టెలు!" అన్నాడు దుకాణదారు. "మనకు వెన్నలాటి రొట్టెలెందుకు? రొట్టెలకన్న మేలయిన వెన్నే కొందాం!" అంటూ గురువు వెన్న దుకాణానికి వెళ్ళాడు.

"మంచి వెన్న, బాబూ! నూనెలాటి వెన్న!" అన్నాడు ఆ దుకాణంవాడు. "అయితే నూనే కొందాం!" అని గురువు నూనె దుకాణానికి వెళ్ళి, "మంచి నూనె ఉన్నదా?" అని అడిగాడు. "నీరులాటి నిర్మలమైన నూనె ఉన్నది, బాబూ!" అన్నాడు నూనెవాడు.

"అయితే పేచీయేలేదు. నూనెకన్న నిర్మలమైన నీరే తాగుదాం!" అంటూ గురువు లోభిని తన ఇంటికి తిరిగి తెచ్చి లోటాడు నీళ్లిచ్చాడు.

లోభి వచ్చినపని అయిపోయింది. అతను తన దేశానికి తిరిగి వెళ్ళిపోయాడు.





# మదాలస

పూర్వం శత్రుజిత్తనే రాజుకు ఒక కుమారుడుండేవాడు. అతని పేరు ఋతుధ్వజుడు. అతను బుద్ధికి బృహస్పతి, అందానికి మన్మధుడు, పరాక్రమంలో అర్జునుడు. అతని స్నేహం కోరి ఎక్కడెక్కడినుండో బ్రాహ్మణ క్షత్రియ వైశ్య కుమారులు వచ్చారు. అదేవిధంగా, నాగలోకంలో నుంచి నాగరాజు కొడుకులిద్దరు, అతని స్నేహం కోరి బ్రాహ్మణ యువకుల వేషాలు ధరించి ఋతుధ్వజుడివద్దకు వచ్చారు. వీళ్లు చూడటానికి చాలా అందంగా ఉండేవాళ్లు. అంతేగాక ఋతుధ్వజుణ్ణి మిగిలిన వాళ్లకన్న ఎక్కువగా అంటిపెట్టుకుని ఉండేవారు. ఋతుధ్వజుడుకూడా వారిని విడిచి ఒక్క క్షణం ఉండేవాడుకాడు. ఆ నాగ కుమారులు పగలల్లా రాజకుమారుడివెంట ఉండి, రాత్రివేళ నాగలోకానికి తిరిగి వెళ్ళుతూండే వారు.

ఒకరోజు నాగరాజు తన కుమారులతో, "మీరు పగలల్లా ఎక్కడికి పోతారు ? రాత్రివేళ తప్ప ఇంటికి రారు; ఏమిటి కారణం ?" అన్నాడు.

అప్పుడు వారు తండ్రితో, "నాన్నా, మేము ఋతుధ్వజుడనే రాజపుత్రుడి స్నేహం సంపాదించి పగలల్లా అతనివెంటే ఉంటున్నాం. అంత తెలివిగలవాడూ, మంచివాడూ, పరాక్రమవంతుడూ మూడు లోకాలలోనూ ఉండడు!" అని చెప్పారు.

దీనికి నాగరాజు చాలా సంతోషించి, "అయితే అతనికి తగిన బహుమానా లేవైనా పట్టుకుపోయి ఇవ్వరాదా ?" అన్నాడు.

"అతనికి మనం ఏమి ఇవ్వగలం ? అతనికి ఏ లోటూలేదు. ఎప్పటికైనా మన వల్ల అతనికి కావలిసిన సహాయం ఏమన్నా ఉంటే అలాగే చేద్దాంలే!" అన్నారు నాగ కుమారులు సంతోషంగా.

ఎస్. తిరుమలరావు



దీనికి నాగరాజుకూడా సమ్మతించాడు.

ఇలా ఉండగా, అరణ్యంలో తపస్సు చేసుకునే గాలవుడనే మునిని పాతాళకేతుడనే రాక్షసుడు బాధించసాగాడు. గాలవుడు ఒక యజ్ఞం ప్రారంభించినా, తపస్సు ప్రారంభించినా, ఈ రాక్షసుడు మాయా రూపంలో వచ్చి విఘ్నాలుచేసేవాడు. ఏం చెయ్యాలో తెలియక గాలవుడు ఆకాశం కేసి చూసి ఒక్క నిట్టూర్పు విడిచాడు. వెంటనే ఆకాశంనుంచి అశ్వం ఒకటి మునీశ్వరుడి ముందు వాలింది. అదే క్షణంలో అశరీరవాణి ఈ విధంగా పలికింది :

"గాలవా, ఇది మూడులోకాలూ తిరిగి రాగల కువలయాశ్వం. దీన్ని తీసుకుపోయి శత్రుజిత్తుడి కుమారుడైన ఋతుధ్వజుడికి ఇయ్యి. అతనీ గుర్రాన్నెక్కి క్రూరకర్ములైన రాక్షసులను సంహరించుతూ, నీ తపస్సును రక్షించగలడు !"

ఈ మాటలు వింటూనే గాలవుడు కువలయశ్వాన్ని ఎక్కి శత్రుజిత్తువద్దకు వెళ్లి, ఋతుధ్వజుణ్ణి పంపమని కోరాడు. ఋతుధ్వజుడు కువలయశ్వాన్ని ఎక్కి గాలవుడి వెంట ఆయన ఆశ్రమానికి వెళ్ళాడు.

సాయంకాలమయింది. గాలవుడు అగ్నిని అర్చించటానికి కూచున్నాడు. ఆ సమయంలో పాతాళకేతుడు అడవిపంది రూపంలో అగ్నిగృహంలో జొరబడి గాలవుణ్ణి భయపెట్టాడు. మునిబాలకులు పెట్టిన కేకలు విని గుర్రంమీద ఋతుధ్వజుడు వచ్చాడు. పందిని ఒక బాణంవేసి కొట్టాడు. దెబ్బతిని అడవిపంది అరుస్తూ పారిపోసాగింది. ఋతుధ్వజుడు దాన్ని గుర్రం మీద వెంబడించాడు. పోయిపోయి పంది ఒక గోతిలో దూకింది. అది పాతాళానికి పోయే సొరంగం.



కువలయాశ్వం మూడులోకాలలోనూ సంచరించగలది గనక, ఋతుధ్వజుడు ఆ సొరంగం వెంబడి పోసాగాడు. కొంతదూరం

వెళ్లేసరికి అతనికి కాంతివంతమైన ఒక నగరం కనబడింది. అతను ఆ నగరం ప్రవేశించి వెళుతూండగా ఒక ఇంటిదగ్గిర ఒక స్త్రీ కనబడింది. ఆ నగరంలో ఆ స్త్రీ తప్ప ఇంకెవ్వరూ ఉన్నట్టు లేదు. పంది జాడ మొదలే లేదు.

రాజకుమారుడు ఆ స్త్రీని సమీపించి, "ఏమమ్మా? ఎవరు నీవు? ఇది ఏం నగరం? నీ పేరేమిటి?" అని అడిగాడు. ఆ స్త్రీ జవాబు చెప్పకుండానే ఇంట్లోకి వెళ్లి పోయింది. ఈ చిత్రమేమిటో తెలుసుకోవాలని రాజకుమారుడు గుర్రందిగి తానుకూడా లోపల ప్రవేశించాడు.

లోపల ఒక గదిలో ఒక హంసతూలికా తల్పంమీద ఒక దేవకన్యలాటి సుందరి పడుకుని ఉన్నది. ఆమె చాలా విచారంగా వున్నది. పక్కనే, బయట కనిపించిన స్త్రీ నిలబడి విసురుతున్నది.

ఋతుధ్వజుణ్ణిచూడగానే ఆ స్త్రీ, "రాజ కుమారా, ఈ కన్య విశ్వావసుడనే గంధర్వ రాజు కూతురు. ఈమె పేరు మదాలస. ఈమెను పాతాళకేతుడనే రాక్షసుడు తన మాయచేత తెచ్చి ఇక్కడ దాచాడు. వచ్చే త్రయోదశినాడు ఈమెను పెళ్ళాడ తాడట! ముహూర్తంపెట్టి వెళ్ళాడు. నా సఖి ఆత్మహత్య చేసుకోబోతే నేనే ఆపాను. నే



నీమె సఖురాలిని, నాపేరు కుండల. మా మదాలసను కాపాడటానికే దేవుడు నిన్నిక్కడికి పంపి ఉంటాడు!" అన్నది.

ఋతుధ్వజుడు తన వృత్తాంతమంతా కుండలకు చెప్పినమీదట, ఆమె మదాలస మనస్సు తెలుసుకుని, "ఈమెను రక్షించే భారం నీదే!" అంటూ మదాలస చెయ్యి రాజకుమారుడి చేతిలో పెట్టి, వారికి పాణిగ్రహణం చేసింది.

తరవాత ఋతుధ్వజుడు మదాలసను తన గుర్రంమీద ఎక్కించుకుని తాను వచ్చిన దారినే భూలోకానికి ప్రయాణమైనాడు. దారిలో పాతాళకేతుడు తన బలాలతోసహా అతనికి అడ్డుతగిలి, "ఎక్కడికి పోతావు? అగు!" అని అరిచాడు.

వెంటనే ఋతుధ్వజుడు బాణంతీసి త్వష్టాస్త్రం వేసేసరికి రాక్షసులంతా బూడిద కుప్పలై పడిపోయారు. ఋతుధ్వజుడు మదాలసను తన ఇంటికి తీసుకుపోయి పెళ్లి చేసుకుని, ఉదయంమొదలు మధ్యాన్నందాకా కువలయాశ్వంమీద భూమి యావత్తూ చుట్టి మునీశ్వరుల యజ్ఞయాగాదులను రక్షిస్తూ, తన భార్యతో సుఖంగా కాలం గడుపుతున్నాడు. కువలయాశ్వాన్నెక్కి తిరుగుతూ ఉండటంవల్ల అతన్ని అందరూ కువలయాశ్వుడని పిలవసాగారు.





ఋతుధ్వజుడిచేత చచ్చిన పాతాళ కేతుడికి ఒక తమ్ముడున్నాడు. వాడి పేరు తాళకేతుడు. తన అన్నను చంపినందుకూ, అతను చేసుకోవాలనుకున్న మదాలసను పెళ్లాడినందుకూ, ఋతుధ్వజుడి మీద పగ తీర్చుకోవాలని వాడికి బుద్ధి పుట్టింది. వాడు ఋషివేషం వేసుకుని, యమునాతీరాన ఒక ఆశ్రమం కల్పించుకుని, అక్కడ దొంగ తపస్సు ప్రారంభించాడు.

ఒకనాడు రాజకుమారుడు ఆశ్రమాలన్నీ తిరుగుతూ అటుగా వచ్చి, ఈ దొంగఋషికి నమస్కారంచేసి, "మహాత్మా, మీకు రాక్షస బాధ లేదుకదా ?" అని అడిగాడు.

"నాయనా, నీ వంటి పరాక్రమశాలి మాకు అండగా ఉంటే రాక్షసబాధ ఎక్కడిది? అయినా నీ వల్ల నా కొక సహాయంకావాలి. చేస్తానంటే చెబుతాను!" అన్నాడు తాళకేతుడు.

"చెప్పండి. తప్పక చేస్తాను!" అన్నాడు రాజకుమారుడు.

"నేను నీటిలోమునిగి నీటియజ్ఞం చెయ్య తలపెట్టాను. అందుకుగాను బంగారం కావాలి. కనక నీ మెడలో ఉన్న హారం ఇచ్చి, ఒడ్డునే నిలబడి రాక్షసులు రాకుండా చూస్తూ ఉండు!" అన్నాడు తాళకేతుడు.

నిజమేకాబోలనుకుని రాజకుమారుడు తన మెడలోని హారం రాక్షసుడికిచ్చి, తాను ధనుర్బాణాలు చేతబట్టి ఒడ్డున నిలబడ్డాడు. రాక్షసుడు నీటిలో మునిగి, నీటి అడుగున ఈదుకుంటూ అవతలిగట్టు చేరి, నేరుగా శత్రుజిత్తుడివద్దకు వెళ్లి, "మహారాజా, ఎటువంటి చెడ్డవార్త చెప్పవలసివచ్చింది! రాక్షసులు నీ కొడుకును చంపేశారు. ప్రాణం పొయ్యే సమయంలో నీ కుమారుడు ఈ హారాన్ని నా కిచ్చాడు. తపస్సుచేసుకునే మాకు ఈ బంగారంతో ఏంపని? ఇది మీకు చేర్చుదామనీ, ఈ వార్త మీతో చెబుదామనీ వచ్చాను!" అనిచెప్పి వెళ్లిపోయాడు.

తనభర్త చనిపోయాడని తెలియగానే మదాలస మొదలు నరికిన చెట్టులాగా పడి పోయి ప్రాణాలు వదిలేసింది. రాజూ రాణీ అంతులేని దుఃఖంలో మునిగిపోయారు.

తాళకేతుడు మళ్ళీ యమునలో ప్రవేశించి రాజకుమారుడున్న చోటికివెళ్ళి, "నాయనా, నా యజ్ఞం నిర్విఘ్నంగా కొనసాగింది. ఇక నీ దారిన నీవు వెళ్ళవచ్చు!" అన్నాడు.

ఋతుధ్వజుడు గుర్రం ఎక్కి తన నగరానికి తిరిగివచ్చాడు. ఎక్కడా ఉత్సాహమన్నది అతనికి కనిపించలేదు. అనేక మంది అతనికేసి అత్యాశ్చర్యంగా చూడసాగారు. అతనికేమీ అర్థంకాలేదు, రాజమందిరానికి వెళ్ళాడు. "బతికే ఉన్నావా, నాయనా?" అంటూ తల్లి దండ్రులు అతన్ని కౌగలించుకున్నారు. కాని వాళ్ళు దుఃఖించటం మానలేదు.

"మీ రెందుకు దుఃఖిస్తున్నారు? ఏం జరిగింది?" అని అతను తల్లి దండ్రులను అడిగాడు. తన మరణవార్త వినటంవల్ల కలిగిన దుఃఖంతో మదాలస చనిపోయిన సంగతి వారు అతనికి చెప్పారు.

ఋతుధ్వజుడి దుఃఖానికి అంతులేదు. తన భార్య చనిపోయిందని తెలిసికూడా ఇంకా బతికివున్నందుకు తనను తాను



తిట్టుకున్నాడు. ఆత్మహత్య చేసుకుందామనుకున్నాడు, కాని మహాపాపమని మానుకున్నాడు. ఇక చేసేదిలేక, "మళ్ళీ నేను ఈ జన్మలో ఇంకొకతెను పెళ్ళాడను!" అని శపథం చేశాడు.

రాజకుమారుడికి కలిగిన ఈ దుఃఖం గురించి అతని స్నేహితులంతా బాధపడ్డారు. నాగరాజు కుమారులు తమ తండ్రివగ్గిరికి వెళ్ళి, "నాన్నా, మనం ఏదైనా సహాయం చెయ్యగలిగితే ఇదే మంచి అవకాశం. ఏ విధంగానన్నా మదాలస తిరిగి బతికితే అతనికి కలిగే ఆనందం అంతా ఇంతా కాదు!" అంటూ జరిగిన సంగతి చెప్పారు.

నాగరాజు కొంచెం ఆలోచించి, "నాశక్తి కొద్దీ ప్రయత్నిస్తాను!" అన్నాడు. ఆయన ఒకప్పుడు సరస్వతీదేవిని ఆరాధించి ఆమె వల్ల అద్భుతంగా పాడేశక్తి సంపాదించిన వాడు. ఆయన ఇప్పుడు కైలాసానికి బయలు దేరి వెళ్లి శివుడి సమక్షాన పాట పాడాడు.

ఆ పాటకు శివుడు ముగ్ధుడై, "నాయనా, ఇంత చక్కగా పాడి నన్ను సంతోషపెట్టావు! నీకు నేనేమి సహాయంచేసేది?" అన్నాడు.

"దేవా, మదాలసను బతికించు!" అన్నాడు నాగరాజు.

"ఆమెకు అంత్యక్రియలుకూడా జరిగినై. ఎలా బతికించను?" అన్నాడు శివుడు.

"దేవా, ఆమెను తిరిగి సృష్టించు. నా చేతిమీదుగా రాజకుమారుడుకి పత్ని దానం చెయ్యాలని చాలా కోరికగా ఉన్నది!" అన్నాడు నాగరాజు.

"అయితే నీవు వెళ్లి పితృపూజ చేసి, మధ్యపిండాన్ని భక్షించు. మదాలస నీ శిరస్సునుంచి తిరిగి జన్మిస్తుంది!" అని శివుడు చెప్పాడు.

నాగరాజు ఆ ప్రకారమే చేశాడు. మదాలస అతని శిరస్సునుంచి బతికి వచ్చింది. నాగరాజు ఆమెను ఒకచోట దాచాడు.

తరవాత ఆయన తన కుమారులను పిలిచి, "నాయనలారా, మీరు ఇంత



కాలంగా ఋతుధ్వజుణ్ణి కొలుస్తున్నారు, కాని ఒక్కనాడుకూడా మన ఇంటికి తీసుకురాలేదు, ఆతిథ్యం ఇవ్వలేదు. ఇదేమి న్యాయం? అతను భార్యపోయిన దిగులుతో బాధపడుతున్నాడుగదా? ఒకసారి ఇక్కడికి తీసుకు రండి, వినోదాలతో అతనికి దిగులు పోగొడదాం!" అన్నాడు.

నాగకుమారులు సరేనని బయలుదేరి వెళ్లి, ఋతుధ్వజుడితో, "మిత్రమా, ఒక్కసారికూడా నీవు మా యింటికి రాలేదు. మా నాన్నగారు నిన్ను పిలుచుకు రమ్మని మరీమరీ అడుగుతున్నారు. రావలసింది," అని బతిమాలారు.

రాజకుమారుడు సరేనని వారివెంట బయలుదేరాడు. నాగకుమారులు అతన్ని గోమతీనది దగ్గిరికి తీసుకుపోయి, తమతో బాటు అతనినికూడా అందులో మునగమన్నారు. నీటిలో మునిగిన మరుక్షణం నాగకుమారులకు బ్రాహ్మణవేషాలు పోయి పాముల శరీరాలూ, నెత్తిన ధగధగా మెరిసే మణులూ వచ్చాయి. యీ వింత మార్పుకు ఋతుధ్వజుడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

"ఏమిటిది? మీరు బ్రాహ్మణకుమారులు కారా? నాగులా? నాదగ్గిర ఈ సంగతి ఎందుకు దాచారు?" అని ఋతుధ్వజుడు వారిని అడిగాడు.



"మిత్రమా, మేము నాగులమని తెలిస్తే దగ్గిర చేరనియ్యవని భయపడి, నీ స్నేహం కోసమై ఈ మోసం చేశాం. మమ్మల్ని క్షమించు!" అన్నారు నాగకుమారులు.

"మీరు నాగులైతే నాకేమీ చింతలేదు. మీరు ఎప్పటికీ నాకు ఆప్తమిత్రులే," అన్నాడు రాజకుమారుడు.

నాగరాజు రాజకుమారుడికి గొప్పగా అతిథ్యం ఇచ్చి, విందులూ, వినోదాలూ ఏర్పాటు చేశాడు. ఆయన అతన్ని మణి సింహాసనంమీద తనపక్కనే కూచోబెట్టుకుని, "నాయనా, నా కొడుకులు నిన్ను ప్రతిక్షణమూ స్మరిస్తూంటారు. ఇటువంటి అల్లుడు దొరికితే ఎంత బాగుండునని నాకు అనిపించి, నిన్ను పిలిపించాను. నీ భార్య అకాలమరణం చెందిందని విన్నాను. నువు యువకుడవు గనక నాకుమార్తెను పెళ్లాడు! నేను చాలా సంతోషిస్తాను! ఇదే నేను నీ కివ్వదలచిన బహుమానం!" అన్నాడు.

"క్షమించండి! నేను మదాలసను తప్ప మరొకరిని పెళ్ళాడనని శపథం చేశాను," అన్నాడు రాజకుమారుడు.

"నా కుమార్తెను చూసినట్టయితే నీ అభిప్రాయం తప్పక మార్చుకుంటావు!" అంటూ నాగరాజు మదాలసకోసం నాగకన్యలను పంపాడు. మదాలస వచ్చింది. భార్యాభర్తలు ఒకరినొకరు చూసుకుని ఆనందపరవశులైపోయారు.

నాగరాజు జరిగినదంతా రాజకుమారుడికి చెప్పి, "ఈమె మొదట నీ భార్యే అయినా ఇప్పుడు నాకు కూతురు. నిన్ను నా అల్లుణ్ణి చేసుకోవటానికిగాను మీకు మళ్లీ వివాహం చేస్తాను!" అన్నాడు.

వారిద్దరికీ నాగలోకంలో అతివైభవంగా వివాహం జరిగింది. నాగరాజు ఋతుధ్వజుడికీ, మదాలసకూ అంతులేని మణులూ, బంగారమూ కానుకగా ఇచ్చి వారిని ఎంతో మర్యాదతో ఇంటికి సాగనంపాడు.







# మాయ చిత్రము

చాలా కాలం క్రితం రాజపుత్రస్థానంలో జయసింహుడనే రాజుండేవాడు. ఆయనకు చిత్రలేఖనంపైన చాలా ప్రీతి. ఆయన ఆస్థానంలో ఒక గొప్ప చిత్రకారు డుండేవాడు. జయసింహుడు తన చిత్తరువును వేయించుకుందామను కుంటుండగా ఆ చిత్రకారుడు అకస్మాత్తుగా చనిపోయాడు. ఆనాడు మొదలు దర్బారులో ఆ చిత్రకారుడి ఆసనం కాళీగానే ఉండిపోయింది.

ఇలా ఉండగా హిమాలయ ప్రాంతం నుంచి హేమచంద్రుడనే పేద చిత్రకారు డొకడు రాజపుత్రస్థానానికి వచ్చాడు. జయసింహుడి ఆస్థాన చిత్రకారుడు చనిపోయాడనీ, అతనికి బదులు ఇంకెవరినీ వేసుకోలేదనీ హేమచంద్రుడికి తెలిసింది. తనకు ఉద్యోగం దొరుకుతుందేమోనన్న ఆశతో తన కంచరగాడిదపై మూడురోజులు, ఎడారి వెంబడి, తిండికూడా లేకుండా ప్రయాణం చేసి, ఆకలితో మలమల మాడిపోతూ జయసింహుడి కోటకు చేరుకున్నాడు.

రాజభటులు మొదట హేమచంద్రుణ్ణి అంతఃపురంలోకి వెళ్ళనివ్వలేదు. "నేను చిత్రకారుణ్ణి. రాజుగారికి చూపటానికి బొమ్మలు తెచ్చాను," అన్నతరవాత వాళ్లు అతన్ని లోపలికి వెళ్లనిచ్చారు.

హేమచంద్రుడు రాజుగారి దర్శనం చేసుకుని, "నిద్రాహారాలు లేకుండా ప్రయాణం చేసి ఎంతో దూరంనుంచి తమరిని చూడవచ్చాను. ఇవి నేను వేసిన బొమ్మలు. వాటిని చూస్తే నా శక్తి తమకే తెలుస్తుంది," అన్నాడు.

ఆ బొమ్మలను చూసి రాజుగారు చాలా సంతోషించాడు. ఇటువంటి శక్తిగల గొప్ప చిత్రకారుడు దూరదేశంనుంచి పొట్టచేత పట్టుకుని ఇంత దూరం ఎందుకు రావలిసి వచ్చిందో జయసింహుడికి అర్థంకాలేదు.

పి. వేదకుమారి

"ఈ బొమ్మలు నాకు చాలా బాగున్నాయి. వీటికి ఏమి ఇవ్వమన్నావు ?" అని జయసింహుడు హేమచంద్రుణ్ణి అడిగాడు.

"ఆకలిగొని ఉన్నాను. ముందు నాకు భోజనం పెట్టించండి. ఆ తరవాత, తమ ఆస్థానంలో ఒక ఆసనం ఖాళీగా ఉన్నదని విన్నాను, దానిపైన నన్ను కూచుంటూ ఉండనివ్వండి. అదే నాకు పదివేలు!" అన్నాడు హేమచంద్రుడు.

రాజు సరేనని తనభటులను పిలిచి హేమచంద్రుణ్ణి భోజనశాలకు పంపాడు. హేమచంద్రుడు కడుపునిండా తిన్నాడు. అతని కంచరగాడిదను రాజుగారి గుర్రాలసాలలో కట్టివేశారు. మర్నాటినుంచి హేమచంద్రుడు దర్బారులో ఆస్థానచిత్రకారుడి ఆసనం పైన కూచోసాగాడు.

ఇప్పుడు తిరిగి ఆస్థాన చిత్రకారుడు ఏర్పడ్డాడు గనక, అతనిచేత తన చిత్తరువు వేయించుకుందామని జయసింహుడికి ఆలోచన కలిగింది. ఆయన హేమచంద్రుడితో, "దివాణంలో మా పూర్వీకులందరి చిత్తరువులూ ఉన్నాయి. నా చిత్తరువుకూడా తయారుచేసి, రాబోయే తరాలవారు నా ఆకారం చూడటానికి అవకాశం కలిగించు!" అన్నాడు.



"తమ ఒక్కరి చిత్తరువే ఏమిటి, మహారాజా! సింహాసనాలమీద తమరినీ రాణీగారినీ ఉంచి, తమ మంత్రులనూ, సేనానాయకులనూ, అందరినీ చిత్రిస్తాను. దివాణంలో మంచిగోడ ఒకటి చూపించండి. మిలిగినదంతా నేను చూసుకుంటాను," అన్నాడు హేమచంద్రుడు.

రాజు పరమానందం చెందాడు, రాజసభ యావత్తూ చిత్రించటానికి హేమచంద్రుడికి అనుమతి ఇచ్చాడు.

రాజుగారి ఆస్థానంలో పెద్దపెద్ద పొట్టలవాళ్ళున్నారు, ఒక గూనివాడున్నాడు, ఒంటికన్నువాడూ, మెల్లకళ్లవాళ్ళూకూడా

ఉన్నారు. వారు ఒక్కొక్కరే హేమచంద్రుడి వద్దకు వచ్చి, "నన్ను చిత్రించేటప్పుడు గూని లేకుండా చిత్రించు. రెండు కళ్ళూ ఉన్నట్టు చిత్రించు. మెల్లకన్ను వెయ్యకు!" అని హెచ్చరించారు ; లేకపోతే చావగొట్టిస్తామనీ, చంపిస్తామనీ వాళ్ళు హేమచంద్రుణ్ణి బాగా భయపెట్టారు.

ఈ సంగతి రాజుగారికి చూచాయగా తెలియవచ్చింది. ఆయన హేమచంద్రుణ్ణి పిలిచి, "ఆస్థానంలో ప్రతి ఒక్కణ్ణీ యథార్థంగా చిత్రించక ఏమైనా మార్పులు చేశావో, నిన్ను ఉరి తీయిస్తాను! జ్ఞాపకం ఉంచుకో!" అని హెచ్చరించాడు.

హేమచంద్రుడికి ముందు నుయ్యీ, వెనక గొయ్యీ అన్నట్టయింది. ఏమి చేసినా చావు తప్పేటట్టు లేదు. అతను దీర్ఘంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

చిత్తరువు వేయటానికి ఒక గోడ ప్రత్యేకించబడింది. దానికి ఒక తెర అడ్డంకట్టి, ముగ్గురు సహాయకులను తీసుకుని, వారితో తింటూ, తాగుతూ, హేమచంద్రుడు వినోదాలతో కాలక్షేపం చేయసాగాడు.

ఒకనెల గడిచింది. రాజుగారు హేమచంద్రుణ్ణి పిలిపించి, చిత్తరువు ఎంతవరకు వచ్చిందని అడిగాడు. "మహారాజా, పని చేస్తున్నాను. త్వరలోనే అయిపోతుంది,"



అన్నాడు హేమచంద్రుడు, భయపడుతూనే, ఎంతో వినయంగా.

ఆ తరవాత వారాని కొకసారి రాజుగారు చిత్తరువు గురించి అడగటమూ, దానికి హేమ చంద్రుడు, "మహారాజా, ఇంకా కొద్దిగా పని మిగిలిఉన్నది!" అని జవాబు చెపుతూండటమూ జరిగింది.

ఈ విధంగా మూడు మాసాలు గడిచాయి. అప్పటికీ చిత్తరువు పూర్తికాక పోయేసరికి రాజుగారికి కోపం వచ్చింది. ఆయన హేమ చంద్రుడితో, "ఇంకొక్క వారంలోపుగా చిత్తరువు పూర్తికాకపోతే నిన్ను కఠినంగా శిక్షిస్తాను!" అన్నాడు.

దానికి హేమచంద్రుడు, "చిత్తరువు పూర్తి అయింది, మహారాజా! రేపు మంచిరోజు. పరివారంతోసహా దయచేశారంటే చిత్తరువు ఆవిష్కరణ చేయవచ్చు!" అన్నాడు.

రాజు సంతోషించి ఈ వార్త సభికు లందరికీ తెలియబరిచాడు.

మర్నాడు రాజూ, రాణీ, ఇతర రాజో ద్యోగులూ చిత్తరువు చూడటానికి వచ్చారు. గోడకింకా తెర అడ్డంకట్టి ఉన్నది.

చిత్తరువు చూడవచ్చిన వారితో హేమ చంద్రుడు, "మిమ్మల్నందరినీ చిత్రించాను. ఎవరి బొమ్మను వారు జాగ్రత్తగా పోల్చు కోండి. కాని, ముందుగా ఒక్క మాట



మనవి చేసుకుంటున్నాను. తమలో గొప్ప పుటక పుట్టినవారికిమాత్రమే నా చిత్తరువు కనిపిస్తుంది; లేనివారికి ఏమీ కనిపించదు!" అంటూ, తెర లాగేశాడు.

గోడమీద ఏబొమ్మా లేదు. కాని ఆ మాట పైకి అనటానికి రాజుగారు మొదలుకొని ప్రతివాడూ జంకాడు. ఎవరిమటుకు వారు, తమకు తప్ప మిగిలిన అందరికీ, చిత్తరువు కనిపిస్తున్నదని అపోహ పడ్డారు.

రాజుగారివెంట ఉండే హాస్యగాడు మటుకు, "నాది ఎంత పాడు పుటకోగాని, నాకు పట్టి గోడే కనిపిస్తున్నది! దానిమీద బొమ్మే లేదు!" అన్నాడు.

మిగిలినవాళ్ళుకూడా "మాకూ బొమ్మ కనిపించటం లేదు," అని బయటపడ్డారు.

హేమచంద్రుడు అందరి కళ్లలోనూ దుమ్ము చల్లటానికి ప్రయత్నించినట్టు రూఢి అయిపోయింది. రాజుగారు ఆగ్రహంతో పళ్ళు పటపట కొరుకుతూ, "నీచుడా, ఇంతమందినీ వంచన చేస్తావా? నిన్ను ఉరి తీయించినా పాపంలేదు!" అన్నాడు.

హేమచంద్రుడు వినయంగా చేతులు జోడించి, "చిత్తం, మహారాజా! నన్ను ఉరి తీయించండి! నేను ప్రాణాలతో బయట పడతానని కలలోకూడా అనుకో లేదు. కాని, దయఉంచి నన్ను బంగారు తాడుతో మాత్రం ఉరితీయించకండి! ఎందు కంటే, లక్ష్మికి నామీద బొత్తిగా కటాక్షం లేదు. నన్ను ఉరితీసే సమయానికి బంగారు తాడు దానంతట అదే తునకలుగా తునిగి పోవచ్చు!" అన్నాడు.

ఈ మాట వినగానే, అంత కోపంలోనూ రాజుకు నవ్వొచ్చింది. హేమచంద్రుడు ఎంత గొప్ప చిత్రకారుడైనా రాజుల ఆస్థానాలలో ఉండటానికి పనికిరాడని ఆయనకు తెలిసిపోయింది. ఆయన హేమచంద్రుడికి కొంత బంగారం ఇచ్చాడు. హేమచంద్రుడు కంచరగాడిదమీద వచ్చినదారి పట్టాడు.



# భేదోపాయం

ఒక గ్రామంలో భీమయ్య అనే కాపు ఒకడుండేవాడు. అతడు ఒక సంవత్సరం తన పొలంలో చెరుకువేశాడు. అది ఏపుగా పెరిగింది. ఆ పొలం పక్కగా వచ్చేపోయే వాళ్ళకు, ఆ చెరుకుగడలు చూడగానే నోరూరేది.

ఆ గ్రామంలోనేవున్న జమీందారుకు, ఆటకాయిగా తిరిగే కొడుకు ఒకడున్నాడు. అతడికి పౌరోహితుడి కొడుకూ, షావుకారు కొడుకూ స్నేహితులు. ఈ ముగ్గురూ కలిసి, ఒక నాటి రాత్రివేళ భీమయ్యచేలో దొంగతనంగా చెరుకుగడలు తినేందుకు వెళ్ళారు.

వాళ్ళు ముగ్గురూ చేలో ప్రవేశించి, చెరుకుగడలు విరవటం భీమయ్య చూచాడు. కాని, వాళ్ళు ముగ్గురు, తను ఒక్కడు! ఏం చేయాలి? భీమయ్యకు క్షణంలో ఒక మంచి వుపాయం తోచింది. అతడు నవ్వుతూ, ఆ ముగ్గురినీ సమీపించి, జమీందారు కొడుకుతో, "బాబూ, మీరు జమీందారుగారి కుమారులు, వీరు పురోహితులుగారి అబ్బాయి, బాగానే వుంది! మీకు కావలసినన్ని చెరుకుగడలు తినండి. కాని, వెంట వడ్డీలమీద వడ్డీలు వసూలు చేసే, యీ షావుకారు కొడుకెందుకు?" అన్నాడు.

"అవునవును! వాణ్ణి, తన్ని తగిలేయ్!" అన్నాడు జమీందారు కొడుకు పొంగిపోతూ.

భీమయ్య షావుకారుకొడుకును కర్రతో బాదేసరికి అతడు పారిపోయాడు. అప్పుడు భీమయ్య పౌరోహితుడి కొడుకుకేసి కర్ర చూపుతూ, "జమీందారుగారి బిడ్డవెంట, యీ తద్దినపు మంత్రాలాయన ఎందుకు?" అన్నాడు.

"అవునవును, వీణ్ణీ తన్ని తగిలేయ్," అన్నాడు జమీందారు కొడుకు.

భీమయ్య కర్ర ఎత్తీఎత్తకముందే పౌరోహితుడి కొడుకు పారిపోయాడు. అప్పుడు భీమయ్య, జమీందారు కొడుకుమీదికి కర్రఎత్తి, "నువ్వు, జమీందారుకొడుకువైతే నాకేం? నీ అధికారం నీ రైతులమీద చలాయించు. తినటానికి, యిక్కడ తేరగా చెరుకుగడ లేమీ లేవు," అనే సరికి, జమీందారు కొడుకుకూడా హడలెత్తి పారిపోయాడు.

'సత్య' కురదారోడ్డు.



# పరుసవేది

పంతం గల విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి పోయి, శవాన్ని దించి భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలో ఉన్న బేతాళుడు, "రాజా, నీవు ఈ అర్ధరాత్రివేళ చాలా శ్రమ పడుతున్నావు. నీ శ్రమ పోగొట్టటానికి ఒక చిన్న కథ చెబుతాను, విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

ఒకప్పుడు మరాళదేశాన్ని సుకేతుడనే రాజు పాలించాడు. ఆయన చాలా పరాక్రమవంతుడే, కాని ధనవంతుడు కాడు. పన్నెండేళ్లపాటు కరువు వచ్చి మరాళ దేశం అతి బీద దేశమైపోయింది. అందుచేత సుకేతుడు తన రాజ్యాన్ని విస్తరించుకోలేకపోయాడు. కరువుకు తాళలేక చాలా మంది చచ్చిపోయారు. అనేకులు దూర దేశాలకు వలసపోయారు. ఈ స్థితిలో మరాళదేశానికి ఒక స్వర్ణకారుడు వచ్చాడు.

బేతాళ కథలు



ఆయన చాలా ముసలివాడు. ఆయన పేరు విశ్వకర్మ.

విశ్వకర్మ సుకేతుడి దర్శనం చేసుకుని, "మహారాజా, నేను చాలాకాలంగా పరుసవేది విద్యకోసం పాకులాడుతున్నాను. ఒక్క ఏడాది గడువిచ్చినట్లయితే నేను అంతులేని బంగారం చెయ్యగలుగుతాను. అంతదాకా నన్ను తమరు పోషించగలరా?" అని అడిగాడు.

ఈ విశ్వకర్మ సహాయంతో బంగారం తయారు చేసినట్టయితే తనదేశ [illegible] ద్ర్యం తీరిపోయి మంచిరోజులు వస్తాయని సుకేతమహారాజుకు తోచింది.

"సరే, ఒక ఏడాదిపాటు నీవు రాజసౌధంలోనే వుండు. నీకుకావలసిన ఏర్పాటులన్నీ నేనుచేస్తాను. ఆ తరవాత నువుచేసే బంగారంలో ఒకవీసం నీవు ఉంచుకుని మిగిలినదంతా నాకివ్వాలి!" అని సుకేతుడు విశ్వకర్మతో అన్నాడు.

విశ్వకర్మ సమ్మతించాడు. ఆయనకు ఒక కర్మాగారం ఏర్పాటుచేసి అందులో ఆయనకు కావలసిన కొలిమీ, మూసలూ, ద్రావకాలూ, మొదలైనవన్నీ ఏర్పాటు [illegible] రకాల లోహాలు ఇచ్చారు. అందులో ఆయన ఒంటరిగా కూచుని అహోరాత్రాలు పనిచేస్తూ వచ్చాడు.



వారాలూ, నెలలూ గడిచాయి. ఆయన అవసరాలన్నిటికీ రాజుగారు పుష్కలంగా డబ్బిస్తున్నారు. కాలం సుఖంగా వెళ్ళిపోతున్నది. చూస్తూండగానే ఏడాది పూర్తి అయింది. ఆఖరురోజున విశ్వకర్మను రాజు తన దగ్గరకు పిలిపించి, "ఏమయ్యా, నువ్వు పరుసవేది తయారు చేయటం ఏమయింది?" అని అడిగాడు.

"మహారాజా, ప్రయోగాలింకా పూర్తి కాలేదు, అయిపోవచ్చాయి. ఇంకొక్క ఆరు నెలలు గడువిప్పిస్తే తమకు కావలసినంత బంగారం చేసిపెడతాను!" అన్నాడు విశ్వకర్మ వినయంగా.



రాజుకు చాలా ఆగ్రహం వచ్చింది.

"ఏడాదిలో బంగారం చేస్తానని అబద్ధమాడావు. అయినా ఈసారికి నిన్ను క్షమిస్తున్నాను. ఆరునెలలలో పుగా నువు బంగారం చెయ్యలేనిపక్షంలో నీ తల కొట్టించి కోటగుమ్మానికి కట్టించగలను జాగ్రత్త! నీమీద యెంతో ఆశలు పెట్టుకున్నాను. దేశానికి దారిద్ర్యం తీరిపోతే సైన్యాలను సమకూర్చి చుట్టుపట్ల వున్న రాజ్యాలన్నిటినీ జయించి చక్రవర్తి ఔదామనుకున్నాను. నా ఆశలన్నీ భగ్నంచేశావు. అయినా ఈసారికి క్షమించాను. రెండవసారి క్షమించేది లేదు," అన్నాడు సుకేతమహారాజు.

విశ్వకర్మకు ఏమిచెయ్యాలో తెలియలేదు. అతనికి బంగారం చెయ్యటం రాదు. ఆ విద్యకోసం జీవితమంతా ధారపోసి ముసలివాడయి పోయాడు. పొట్ట గడపక అబద్ధాలతో వారినీ, వీరినీ మోసంచేస్తూ ఇంతదాకా తోసుకువచ్చాడు. ఈ ఏడాది లోపల తనకు చావు రాకపోతుందా అనే ధైర్యంతో సుకేతమహారాజును యేడాది గడువు అడిగాడు. కాని చావు రాలేదు. బలవంతపు చావు చావటం విశ్వకర్మకు ఇష్టంలేదు. ఇప్పుడు తనకు ఇంకొక ఆరు నెలలు గడువు దొరికింది. కాని ఆ తరవాత





ఏమిచెయ్యాలో ముసలివాడికి బోధపడలేదు. అతడు అక్కడినుంచి పారిపోదామని చూశాడు. కాని సాధ్యపడలేదు. రాజు ఆయనవెంట రాత్రింబగళ్ళు భటులను కాపలావుంచాడు. రాజుగారు అన్నమాటలు ముసలివాడి చెవిలో గింగురు మంటూండేవి. ఆయన తనకు బలవంతపు చావు తప్పదని నిశ్చయించుకున్నాడు.

ఆరునెలలూ గడిచాయి. విశ్వకర్మను రాజుగారు పిలిపించి, "బంగారం సంగతి ఏం చేశావు?" అని అడిగాడు.

"మహారాజా, బంగారంచేసే గీత నాచేతిలో లేదు. నాకు బ్రహ్మ వెయ్యేళ్ళు ఆయుర్దాయం ఇచ్చినా నేను బంగారం చెయ్యలేను!" అన్నాడు విశ్వకర్మ నిర్భయంగా.

"ఇందుకుగాను నేను నీకు విధించబోయే శిక్ష తెలుసుగదా?" అన్నాడు సుకేత మహారాజు కోపంగా.

"నన్ను ఏలినవారు శిక్షించ నవసరం లేదు. బంగారంకంటెకూడా మీకు ఎక్కువగా పనికివచ్చేది, మేలుచేసేది కని పెట్టాను!" అన్నాడు విశ్వకర్మ.

"ఏమిటది? వెంటనే చెప్పు!" అన్నాడు రాజు అనుమానంతో.



"వెండి! అది మామూలు వెండి కాదు, కొన్ని మూలికలతో శుద్ధిచేసిన వెండి!"

"దానివల్ల నాకేమి లాభం?" అని రాజు అడిగాడు.

"మహారాజా, ఆ వెండితో రేకు తయారు చేసి, తమ కరవాలం పిడికి తొడుగు తయారుచేస్తాను! ఆ కరవాలం తమరు చేత బట్టినట్టయితే ఎంత బలమైన శత్రువుకూడా దానికి ఆహుతి అయిపోవలసిందే! మీకు కావలిసిన బంగారమంతా అది సంపాదించి పెడుతుంది!" అన్నాడు విశ్వకర్మ.

"నన్ను మరొకసారి మోసగించు తున్నావా?" అని రాజు అడిగాడు.

"మహారాజా, తమరిని మోసగించి నేను ఎక్కడికి పారిపోగలను? నేను తయారుచేసిన వెండికి అలాటి ప్రభావం లేదని తమకు తోస్తే అప్పుడే నా తల తీయించండి!" అన్నాడు విశ్వకర్మ.

రాజు సమ్మతించాడు. విశ్వకర్మ రాజుగారి కరవాలం తెప్పించి, దాని పిడికి ఒక వెండి తొడుగు వేశాడు. రాజుగారు ఆ కరవాలానికి పెద్ద ఎత్తున ఊరేగింపూ, పూజలూ, ఉత్సవాలూ చేయించాడు. విశ్వకర్మకు ఒక జాగీరు బహుమానంగా ఇచ్చాడు.

ఈ వార్త నలువైపులా పాకింది. చుట్టుపక్కల రాజులుకొందరు భయపడసాగారు. మరికొందరు ఈ వార్తలను నమ్మలేదు. "ఆ విశ్వకర్మ యెవడో, చాలా తెలివైన ఘటం. సుకేతమహారాజును గొప్పగా మోసగించాడు!" అనుకున్నారు.

త్వరలోనే సుకేతుడు తన కొద్ది బలాలను కూడగట్టుకుని పారుగు రాజ్యం మీదికి యుద్ధానికి బయలుదేరాడు. పొరుగురాజు తన మంత్రులతో ఆలోచనచేశాడు.

"మహారాజా, సుకేతుడు తన కరవాలాన్ని నమ్మి, కొద్దిబలంతో మనమీదికి వస్తున్నాడు. మనం భయపడవలిసిన పని లేదు. యుద్ధానికి సిద్ధం అవుదాం!" అని కొందరు మంత్రులు సలహాయిచ్చారు.



"అ కరవాలంలో ఏదో మహిమలేకపోతే అంత కొద్ది సైన్యంతో మనమీదికి యుద్ధానికి రావటానికి సుకేతుడు వెర్రివాడుకాడు. ఆ కరవాలం శత్రుకంఠం కొయ్యక విడవదని అందరూ అంటున్నారు. బతికుంటే బలుసాకు తినవచ్చు! మహారాజా, సుకేతుడితో సంధిచేసుకోండి!" అని మరి కొందరు చెప్పారు.

పారుగురాజు బెదిరిపోయాడు. అయన దూతలను వెంటబెట్టుకుని సుకేతుడి శిబిరానికి వెళ్ళాడు. సుకేతుడు తనచేత కరవాలంపట్టుకుని నిలబడివున్నాడు. ఆ కరవాలంలో మృత్యుదేవత వున్నట్టే కనబడింది పారుగురాజుకు. అయన సంకోచించకుండా సుకేతుడికి సామంతు కావటానికి సమ్మతించాడు. సుకేతుడు, అతడిదగ్గిర కప్పంగా చాలా ధనం వసూలుచేసి, దాన్ని తన సైనికులకు పంచాడు.

ఇదిమొదలు సుకేతుడు ఎక్కడా అపజయం యెరగడు. కొందరు రాజులు మూర్ఛించి సుకేతుడితో యుద్ధానికి తలపడ్డారు. కాని సుకేతుడు కత్తి ఎత్తివస్తూ కనిపించేసరికి సైన్యాలు చెదిరి చిందరవందరగా పారిపోవటమూ, పరాక్రమవంతుడైన సుకేతుడు శత్రురాజుతో కలియబడి చంపటమూ జరిగింది.



ఈవిధంగా ఒకరిద్దరు రాజులు చచ్చాక సుకేతుడు దూతలను పంపితే చాలు ఎక్కడెక్కడి రాజులూ వచ్చి ఆయనకు పాదాక్రాంతులైపోయారు. సుకేతుడు వారివద్ద నుంచి కప్పంగా చాలా ధనం గుంజుకున్నాడు. ఈవిధంగా సుకేతుడు చక్రవర్తి అయాడు. మరాళదేశానికి దారిద్ర్యం తీరిపోయింది. విశ్వకర్మ పేరు శాశ్వతంగా నిలిచి పోయింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ఎన్నో ఏళ్ళపాటు ప్రయత్నించికూడా చిన్నంఎత్తు బంగారం చెయ్యలేని విశ్వకర్మ ఇంత మహిమగల వెండిని ఆరునెలలలో ఎలా చేయగలిగాడు? అలాటి వెండిని తయారు చేసే శక్తి తనవద్ద వుండికూడా ఆయన అబద్ధాలాడుతూ ఎందుకు పొట్టపోసుకోవలిసివచ్చింది? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీతల పగిలిపోతుంది!" అన్నాడు.

"విశ్వకర్మ చేసిన వెండిలో ఏమహిమా లేదు. అన్నిమహిమలూ నమ్మేవారి మనసులలోనే వుంటాయి. సుకేతుడు ఆ వెండికి మహిమ వున్నదని నమ్మటంవల్లనే కొద్ది సైన్యంతో యుద్ధానికి బయలుదేరాడు. అటువంటి నమ్మకమే వుండటంమూలాన పొరుగురాజు యుద్ధంచెయ్యకుండానే సుకేతుడికి లొంగిపోయాడు. నమ్మేవారి సంఖ్య పెరిగినకొద్దీ మహిమకూడా పెరిగింది. పదార్థాన్ని సృష్టించటంకంటె మహిమలను సృష్టించటం తేలిక. ఈసంగతి గ్రహించక విశ్వకర్మ అబద్ధాలతో పొట్టపోసుకుంటూ వచ్చాడు. కాని తన ప్రాణంమీదికి వచ్చేసరికి విశ్వకర్మకు ఈ రహస్యం తెలిసింది. ఇదే అతను ముసలితనంలో సాధించిన పరుసవేది!" అన్నాడు విక్రమార్కుడు.

ఈ విధంగా రాజుకు తిరిగీ మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)



# అలెగ్జాండరు - చిత్రకారుడు

అలెగ్జాండరు ఒకసారి ఒక ప్రఖ్యాత చిత్రకారుణ్ణి పిలిపించి తన గుర్రాన్ని చిత్రించ వలసిందని ఆజ్ఞాపించాడు. చిత్రకారుడు ఎంతో శ్రమపడి గుర్రాన్ని చిత్రించాడు. అలెగ్జాండరు దాన్ని చూసి చాలా సంతోషించాడు. కాని తన సంతోషాన్ని బయటికి కన్పించనీయలేదు. అలా చేస్తే చిత్రకారుడి గొప్పతనాన్ని గుర్తించినట్లవుతుందని ఆలోచించి, ఆ చిత్రంలో ఏవో చాలా దోషాలున్నట్లు చెప్పాడు. ఇలా దోషాలున్నాయని చెప్పడంవల్ల చిత్రకారుడు తనకు దాసోహం అంటాడనుకున్నాడు. కాని చిత్రకారుడు మారుమాట్లాడకుండా అంతా విని, చివరకు—"అయ్యా! దయచేసి మీ గుర్రాన్ని ఒకసారి రప్పించగలరా?" అన్నాడు.

అలెగ్జాండరుకు అర్థం కాలేదు. సరే నన్నాడు. గుర్రం వస్తూనే, చిత్రకారుడు గీసిన బొమ్మను చూసి సకిలించ సాగింది.

అలెగ్జాండరుకు అప్పటికీ అర్థం కాలేదు. అప్పుడు చిత్రకారుడే స్వయంగా చెప్పాడు—" మీ కంటే ఈ గుర్రం చాలా తెలివైంది. ఈ చిత్రంలో ఉన్న గుర్రం నిజమైనదని భావించి సకిలిస్తున్నది! నా చిత్రకళలోని సజీవ గుణానికి ఇంత కంటే గొప్ప ప్రమాణం ఏంకావాలి ?"

అలెగ్జాండరు తన తప్పును గుర్తించి, వెంటనే చిత్రకారుడికి చాలా బహుమానాలిచ్చి సన్మానించాడు.



# నావికుడు సింద్‌బాద్

చాలా నెలలపాటు నాకు జీవితం సుఖంగా గడిచింది. నేనూ నా భార్యా అన్యోన్యంగా ఉండేవాళ్లం. అందుచేత నేను రహస్యంగా బాగ్దాదుకు పారిపోయేటప్పుడు నా భార్యనుకూడా వెంటబెట్టుకు పోదామనుకున్నాను. తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడన్నది ఎన్నటికీ అబద్ధంకాదు. నేను పగటికలలు కన్నానన్న విషయం త్వరలోనే స్పష్టమయింది.

ఒకనాడు నా పొరుగింటి పెద్దమనిషి భార్య చనిపోయింది. నే నాయనను పరామర్శించటానికి వెళ్లి, "అన్నా, విచారించకండి. విచారించి మనం చేయగలదికూడా ఏమీలేదు. ఈ వియోగాన్ని మీరు త్వరలోనే మరచిపోతారు. ఎవరు చూశారు? మీకు ఇంతకంటెకూడా యోగ్యురాలైన భార్య ఈసారి దొరకవచ్చు," అన్నాను.

నా మాటలు విని ఆయన ఆశ్చర్యపోయినట్టు కనపడ్డాడు. "కొద్దిగంటల్లో చచ్చిపోబోతున్నవాడికి ఇంకో భార్య ఏమిటి?" అన్నాడాయన.

ఈసారి ఆశ్చర్యపడటం నా వంతు. "అలా అంటున్నారేమిటి? ఎందుకు నిష్కారణంగా నిరాశపడిపోతున్నారు? అల్లా కటాక్షంవల్ల మీ ఆరోగ్యానికేమీ

నాలుగవ సముద్రయానం

CHITRA

లోపంలేదే! కొంపతీసి, ఆత్మహత్యగాని తల పెట్ట లేదుగద?" అన్నాను.

దాని కాయన, "మీకు మాదేశపు ఆచారాలు తెలీవన్నమాట! మాదేశంలో భార్యాభర్తలలో ఎవరు చనిపోయినా, శవంవెంట రెండోవారినికూడా పూడ్చేస్తారు. అనాదిగా వస్తున్న ఈ ఆచారానికి అందరూ, రాజుగారు సయితం, బద్ధులే!" అన్నాడు.

"ఛీ ఛీ! ఇదేం ఆచారం! నాబొందెలో ఊపిరి ఉండగా ఇలాటి ఆచారాన్ని నేను ఆమోదించను," అన్నాను.

మేము మాట్లాడుతుండగానే ఆయన బంధువు లంతా వచ్చి, ఆయన భార్య చచ్చినందుకూ, ఆయన చావబోతున్నందుకూ తమ సంతాపాన్ని వెలిబుచ్చారు. తరవాత ఉత్తరక్రియలకు ఏర్పాట్లు జరిగాయి. ఆయన భార్య శవాన్ని చక్కగా అలంకరించి, ఆమె కుండిన ఖరీదైన నగలన్నీ పెట్టి శ్మశానానికి బయలుదేర దీశారు. శవపేటిక వెనక భర్త నడిచాడు. అతని వెనకగా బంధువులూ, ఇతరులూ నడిచారు.

అంవరమూ నదీతీరాన గల ఒక కొండ వద్దకు వెళ్ళాం. ఆ కొండమీద ఒక చోట ఒక లోతైన బావిలాటిది ఉన్నది. దానిపై విశాలమైన బండరాతి పలక కప్పివున్నది. ఈ పలకను పక్కకు లాగి శవపేటికను





బావిలోకి దించారు. తరవాత నా స్నేహి తుణ్ణి పట్టుకుని తాళ్ల సహాయంతో లోపలికి దించారు. ఆ తాడుకే ఒక నీళ్ల కూజా, ఏడు రొట్టెలూ కట్టారు. నా స్నేహితుడు కిందికి దిగటానికి కొంచెమైనా అసమ్మతి తెలపలేదు. తిరిగి రాతిని బావిమీదికి తోసే శారు. మేమందరమూ తిరిగి వచ్చేశాం.

నేనుకూడా ఈ ఘోరమైన ఆచారంలో పాల్గొన్నాను. నా మనస్సు చాలా బాధ పడింది. ఇంతకన్న దారుణమైనది నే నెన్నడూ చూడలేదనిపించింది. రాజభవనం చేరుతూనే నేను రాజుగారిని చూసి, "అయ్యా, నేను చాలా దేశాలు చూశాను గాని, చచ్చిపోయిన భార్యతో బతికున్న భర్తను పాతిపెట్టటంలాంటి అమానుష మైన ఆచారం ఎక్కడా చూడలేదు. ఈ దురాచారం పరదేశీయులకుకూడా వర్తి స్తుందా, దయచేసి చెప్పండి!" అన్నాను.

"తప్పక వర్తిస్తుంది. భార్య పోతే ఇక్కడ ఉండే పరదేశీయుడుకూడా ఆ భార్యతో పోవలిసిందే!" అన్నాడు రాజు.

నా పొట్టలో ఎవరో చెయ్యిపెట్టి కెలికి నట్టయింది. ఎంత ప్రయత్నించినా ఆగని గుండెదడతో నే నింటికి వెళ్ళి, నేను లేని సమయంలో నా భార్య చచ్చిపోయిందేమో నని ఆత్రంగా చూశాను. ఆమె పూర్తి ఆరో గ్యంతో ఉండటం చూడగానే నాలో నేను కాస్త ఊరటచెంది, "భయపడక, సింద్ బాద్! నువే ముందు చస్తావు. నిన్ను బతికుండగా పూడ్చరులే!" అని ధైర్యం చెప్పుకున్నాను. కాని ఇది అడియాసగా పరిణమించింది. ఎందుకంటే తరవాత కొద్దికాలానికే నా భార్యకు జబ్బుచేసింది. ఆవిడ కొద్దిరోజులు మంచానపడి తీసుకుని చివరకు తన ఆత్మను అల్లాపరం చేసేసింది.

నా దుఃఖానికీ, భయానికీ అంతే లేదు. బతికుండగా పూడ్చిపెడితే ఏమయింది, నరభక్షకులు తినేస్తే ఏమయింది? రాజు

గారు వచ్చి నా చావుగురించి తన విచారం వెలిబుచ్చాక, అశ అంటూ ఏమన్నా మిగిలి ఉంటే అదికూడా అడుగంటింది. ఆయనకు నేనంటే ఎంత ప్రేమ! నన్ను సమాధి చేసేటప్పుడు తానూ, తన దివాణం అధి కార్లూ స్వయంగా వస్తామని చెప్పాడు. నా భార్యను అలంకరించి సర్వాభరణభూషితు రాలిని చేసి పెట్టెలో పెట్టి తీసుకువెళ్ళే టప్పుడు, పెట్టె వెనకగా నేను నడుస్తుంటే రాజుగారు నా వెంబటే నడిచాడు.




సముద్రతీరాన గల కొండవద్దకు చేరాం. బావిమీద ఉండే మూతను పక్కకు తోశారు. నా భార్య శవాన్ని లోపలికి దించారు. నాకు వీడ్కోలు చెప్పటానికి వచ్చినవారంతా నా చుట్టూ మూగారు. అప్పుడు నేను రాజుగారితో, "మీ దేశపు ఆచారానికి నన్ను గురిచెయ్యటం ఎంత మాత్రం భావ్యంకాదు. మా దేశంలో నాకు భార్య ఉన్నది, బిడ్డలున్నారు. వారు నాకోసం ఎదురుచూస్తున్నారు," అని వాపోయాను.

నా మాటలు ఒకరూ వినిపించుకోలేదు. నా చేతుల కిందుగా తాళ్లు దూర్చారు, ఆ తాళ్లకే నీటి కూజా, ఏడు రొట్టెలూ కట్టారు, నన్ను లోపలికి దించారు. "తాళ్లు ఊడ దీసెయ్యి, పైకి లాక్కుంటాం!" అని వాళ్లు పైనుంచి కేకపెట్టారు. నేనా పని చెయ్యక, నన్ను పైకి లాగమన్నట్టుగా తాళ్లు గుంజాను. వాళ్లు విసిగిపోయి తాళ్ళను లోపల పడేసి, బావి మూసి వెళ్ళిపోయారు.

లోపల ఒక విశాలమైన గుహలాగా ఉన్నది. పైనుంచి కొంత వెలుతురు వస్తూండటంవల్ల బొత్తిగా అంధకారంగా లేదు. నేను నేలమీద కూలబడి చాలా సేపు దుఃఖించి, "హాయిగా, ఇంటిపట్టున కూచోలేక వచ్చినందుకు నా గతి ఇంతే కావాలి! ఆ పడవ పగిలినప్పుడు సము ద్రంలో మునిగి చచ్చానుకాను! నేనీ దిక్కు

మాలిన దేశంలో ఎందుకు పెళ్ళాడాలి? ఇలాటి చావు ఎందుకు చావాలి?" అనుకున్నాను.

కొంతసేపటికి ఆకలి దప్పులు ఆరంభమయాయి. నేను సాధ్యమైనంత కాలం ఆయుర్దాయం పొడిగించుకోవటానికి నిశ్చయించుకుని, రొట్టెలూ, నీళ్ళూ కొంచెం కొంచెంగా ఖర్చుచేయ సాగాను. రాత్రివేళ పడుకోవటానికి ఒక చోటు ఏర్పాటుచేసుకున్నాను. క్రమక్రమంగా నా నీరూ రొట్టెలూ అయిపోయాయి. ఇక చావుకోసం వేచివుండటం తప్ప నేను చేయకలిగినదేమీ లేదు. ఆ స్థితిలో ఒకసారి నాకు ఏదో చప్పుడు వినపడి నిద్రాభంగ మయింది. జాగ్రత్తగా వింటే ఎవరో శ్వాస పీల్చే చప్పుడు వినబడింది. తరవాత ఏదో జంతువు పారిపోతున్న చప్పుడయింది. నేను సాహసించి ఆ పారిపోయే ప్రాణిని వెంబడించాను. చాలా దూరం పడుతూ లేస్తూ, ఎక్కుతూ, దిగుతూ పోగా పోగా ఎదటగా ఒకే ఒక నక్షత్రం మిలమిలా మెరుస్తూ కనబడింది!

నా ఆశ్చర్యానికి మేరలేదు. అది గుహలోకి మరొక బావి అయివుండవచ్చు, దానిలోనుంచికూడా శవాలను పడేస్తారేమో ననుకున్నాను. కాని తీరా దగ్గరకు వెళ్ళేసరికి అది ఒక సన్నని బొరియలాగా వుంది.



శవాలను తినటానికి ఏ నక్కలో, తోడేళ్ళో ఆ బొరియను ఉపయోగిస్తూ ఉండాలి. దానిలోనుంచి దూరి నేను పైకి వచ్చేసరికి ఆకాశం నక్షత్రాలతో వెలిగిపోతున్నది. నా ఎదట సముద్రమూ, వెనక కొండా వున్నవి.

నేను అక్కడే మోకరించి భగవంతుడికి నా కృతజ్ఞత తెలుపుకున్నాను. తరవాత వచ్చిన దారినే మళ్ళీ శవాల గుహలోకి వెళ్ళి అక్కడి శవాలమీద గల నగలన్నిటినీ దోచి మూటగట్టి తీసుకువచ్చి సముద్ర తీరాన కొండ అడుగున భద్రంగా దాచాను.

దొరికిన ఆహారం తింటూ ఆ తీరానే కొన్ని రోజులు వేచిఉన్నమీదట ఒకనాడు నాకొక పడవ కనబడింది. నేను వెంటనే నా తలపాగా ఊడదీసి, దానిని గాలిలో ఎగిరేటట్టు పట్టుకుని తీరంవెంబడి అటూ, ఇటూ పరిగెత్తాను. అదృష్టవశాన పడవలోవాళ్ళు నన్ను గమనించారు. పడవను ఒడ్డుకు తెచ్చి నన్నూ, నా మూటలనూ అందులోకి ఎక్కించుకున్నారు.

పడవసరంగు నాదగ్గిరికి వచ్చి, "ఏమయ్యా, ఇన్నేళ్ళుగా, ఈ తీరం వెంబడి పడవ నడుపుతున్నాను, ఈ కొండ దిగువ ఎన్నడూ నరప్రాణి కనిపించిన పాపాన పోలేదే! నువ్విక్కడికెట్లా వచ్చావు?" అని అడిగాడు.



"ఏం చెప్పేది, బాబూ? ఒక పెద్ద ఓడలో అనేకమంది వర్తకులం ప్రయాణం చేస్తుండగా తుఫాను వచ్చి ఓడ కాస్తా పగిలిపోయింది. నేనొక్కణ్ణే ప్రాణాలతో బయటపడ్డాను. అదృష్టవశాన నాకొక పెద్ద కొయ్యపలక దొరికింది, దానిమీద నా సరుకులు వేసుకుని, నేనుకూడా ఎక్కి ప్రాణాలు దక్కించుకుని ఇక్కడ వచ్చిపడ్డాను," అని చెప్పాను. నాకు పెళ్లి అయిందనీ, నాభార్య చచ్చిపోతే నన్నుకూడా పాతేశారనీ చెబితే ఆ దిక్కుమాలిన దేశంవాడెవడైనా పడవలో ఉండి వింటాడేమోనని నాకు భయంవేసి అబద్ధం చెప్పేశాను.

సరంగును మంచి చేసుకుందామనే ఉద్దేశంతో నేను, శ్మశానంనుంచి తెచ్చిన నగలలో మంచి వెలగలది ఒకటి తీసి, "ఉంచండి!" అని ఇవ్వబోయాను. కాని సరంగు దానిని నిరాకరిస్తూ, "వద్దు! ప్రయాణీకులవద్ద డబ్బు పుచ్చుకుంటాను గాని ప్రాణాపాయస్థితిలో కాపాడిన మనిషి వద్ద డబ్బు పుచ్చుకునే అచారం లేదు. ఎంతోమందికి భోజనమూ, దుస్తులూ, దారిఖర్చులూకూడా ఎదురిచ్చాను. మనుషులు ఇతర మనుషులపట్ల మనుషులల్లే ప్రవర్తించటం ధర్మం!" అన్నాడు.

ఆ మనిషికిగల ధర్మబుద్ధి చూస్తే నాకు చాలా ఆనందం కలిగింది. మా ప్రయాణం చాలా సుఖంగా సాగింది. నేను గంటల తరబడి పడుకుని విశ్రాంతి తీసుకుంటూ నా అనుభవాలు జ్ఞాపకం తెచ్చుకునేవాణ్ణి. నేనెదుర్కొన్న కష్టాలన్నీ కలలలాగా తోచేవి. నాభార్య శవంతో ఆ గుహలో ఉండటం జ్ఞాపకం వచ్చినప్పుడు ఒళ్ళు చల్లబడేది.

ఎలాగైతేనేం మా పడవ బస్రా చేరింది. అక్కడ కొద్ది రోజులుండి, నది వెంబడి బగ్దాదు చేరాను. నన్ను చూసీ, నేను తెచ్చిన సరుకు చూసీ, నా బంధు మిత్రాదులంతా పరమానంద భరితులైయ్యారు.






## 5

[ట్రోయ్ రాజు కొడుకైన మోహనుడు భువనసుందరిని ఎత్తుకుపోయినందువల్ల గ్రీకులు తమ నావలనూ, బలాలనూ అయత్తం చేసుకుని ట్రోయ్‌పైకి దండెత్తి వచ్చారు. మొదటి రోజు యుద్ధంలో ట్రోజనులు దెబ్బతిని తమ నగరంలోకి పారిపోయారు. తరువాత గ్రీకులు ట్రోయ్‌నగరానికి ముట్టడివేసి పరిసరదేశాలను కొల్లగొట్ట సాగారు. ట్రోయ్ ముట్టడి తొమ్మిది సంవత్సరాలపాటు సాగింది. ఈ తొమ్మిదేళ్ల కాలంలోనూ యుద్ధం ఏమీ జరగలేదుగాని గ్రీకు శిబిరంలోనూ, బయటాకూడా అక్రమాలు అనేకం జరిగాయి.]

ట్రోయ్‌నగరాన్ని గ్రీకులు ముట్టడించి తొమ్మిదేళ్ళు నిండుతున్నది. చలికాలం వచ్చింది. చలికాలంలో యుద్ధం జరగదు. అందుచేత గ్రీకులు ఈ రోజులలో తమ సైనిక శిబిరాన్ని విస్తరింపజేసుకుని, విలువిద్య సాధన చేస్తూ కాలం వెళ్ళబుచ్చారు.

యుద్ధభూమికి కొంత దూరాన సూర్యభగవానుడి ఆలయం ఒకటి ఉన్నది. ఇది తటస్థ ప్రాంతం. ఈ దేవుడికి బలులు ఇవ్వటానికిగాను గ్రీకులూ, ట్రోజనులూ కూడా వెళుతూ ఉండేవాళ్ళు. ట్రోయ్ నగరపు ప్రముఖులు ఈ ఆలయంలోనే గ్రీకులకు అప్పుడప్పుడూ కనిపించేవారు.

ఒకనాడు వజ్రకాయుడు ఈ ఆలయంలో బలులివ్వటానికి వచ్చేసరికి, అక్కడ అతనికి వర్థనుడి భార్యా, కుమార్తే కనిపించారు. వారుకూడా దేవుడికి బలులు ఇవ్వటానికే వచ్చారు. వర్థనుడి కుమార్తె ప్రమోదిని






అత్యంత సౌందర్యవతి. ఆమెను చూస్తూనే వజ్రకాయుడు అంతులేని ప్రేమావేశం పొందాడు. అతను శిబిరానికి తిరిగివస్తూనే ఒక దూతను వీరసింహుడివద్దకు పంపాడు. "వజ్రకాయుడు నీ చెల్లెలయిన ప్రమోదినిని వివాహమాడ గోరుతున్నాడు," అని ఈ దూత వీరసింహుడితో చెప్పాడు.

"నీవు గ్రీకు శిబిరాన్ని విడనాడి నా తండ్రి అయిన వర్ధనుడి పక్షం వచ్చినట్టుయితే నా చెల్లెలిని వివాహమాడవచ్చు. గ్రీకులకు ద్రోహం చెయ్యలేని పక్షాన కనీసం మీ వీరులలో భూథవుడనేవాడినీ, మరికొందరు వీరులనూ హత్యచేస్తానని ప్రమాణం చెయ్యి!" అని వీరసింహుడు వజ్రకాయుడికి జవాబు పంపాడు.

వజ్రకాయుడు ఈ షరతులకు లోబడటానికి వెనకాడాడు.

ఇంతలో శీతాకాలం వెళ్ళిపోయి వసంతం ఆరంభమయింది. దానితోబాటు యుద్ధం కూడా మళ్ళీ సాగింది. యుద్ధరంగాన ఎలాగైనా వీరసింహుణ్ణి కలవాలని వజ్రకాయుడు చాలా యత్నించాడు, కాని ఈ యత్నాలు ఫలించలేదు. ఒకసారి అతను వీరసింహుడికేసి వెళ్ళే సమయంలో, వీరసింహుడి తమ్ము డొకడు వజ్రకాయుడి అరిచేతిలో బాణం కొట్టి గాయపరిచాడు.

యుద్ధ వైఖరి చూస్తే దేవతలు గ్రీకులకు ప్రతికూలంగా ఉన్నట్టు కనబడింది.

లోగడ వజ్రకాయుడు ట్రోయ్ పరిసర రాజ్యాలను కొల్లగొట్టినప్పుడు అనేకమంది స్త్రీలు అతనికి బానిసలుగా చిక్కారు. వీరిలో హేమ అనే పిల్ల ఒక్కతే, భామిని అనే పిల్ల ఒక్కతే ఉన్నారు. గ్రీకువీరులు ఈ బానిసలను పంచుకునేటప్పుడు హేమ రారాజు వంతూ, భామిని వజ్రకాయుడి వంతూ కావటం జరిగింది.

వీరిలో హేమ తండ్రి పేరు హేమాంబరుడు. ఆయన సూర్యోపాసకుడు; తన





కుమార్తెను గ్రీకులనుంచి తిరిగి తెచ్చుకునే ఉద్దేశంతో కొన్ని కానుకలు తీసుకుపోయి రారాజుకు అర్పించి తన కుమార్తెను విడిచిపుచ్చమని కోరాడు.

కాని రారాజు ఆయన మాట వినిపించుకోక, ఆయన ఇచ్చిన కానుకలు తీసుకోక హేమాంబరుణ్ణి నానా తిట్లూ తిట్టి వెళ్ళగొట్టించాడు. ఈ సంఘటన జరిగినది లగాయతు ప్రతిరోజూ గ్రీకు శిబిరంపై ఎటునుంచో వచ్చి బాణాలు పడటమూ, ఆ కారణంగా గ్రీకు సైనికులు వందలాదిగా చావటమూ జరిగింది.

ఇలా పది రోజులు గడిచినమీదట, గ్రీకు నౌకలకు మార్గదర్శకుడుగా వచ్చిన కాంశుకుడు ఒక సంగతి బయటపెట్టాడు.

"హేమాంబరుడు సూర్యోపాసకుడు. సూర్యుడికి అత్యంత ప్రియుడు. అతను తన కుమార్తెను విడిచిపుచ్చమని రాగా, రారాజు దుర్భాషలాడి పంపాడు. హేమాంబరుడు సూర్యభగవానుణ్ణి వేడుకొనగా, ఆయన మనపై ఈ బాణాలు వేసి శిక్షిస్తున్నాడు! ఈ ప్రమాదంనుంచి తప్పించుకోవాలంటే హేమను సగౌరవంగా వెంటనే ఆమె తండ్రివద్దకు పంపాలి!" అని కాంశుకుడు చెప్పాడు.



రారాజు ఈ మాటలు నమ్మి, హేమను తక్షణమే హేమాంబరుడివద్దకు పంపి, తనను అడిగేవాడుండడనే ఉద్దేశంతో, వజ్రకాయుడి వంతు వచ్చిన భామిని అనే పిల్లను తాను తీసుకున్నాడు.

ఇది చూసి వజ్రకాయుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. "ఇకమీదట నాకీ యుద్ధంతో ఏమీ సంబంధం లేదు. నేనింక ఈ యుద్ధంలో పాల్గొనేది లేదు!" అని అతను శపథం చేశాడు. అతను ఆదివరకే ప్రమోదినిని ప్రేమించి ఉన్నాడు; ఆమె తండ్రి అయిన వర్ధనుణ్ణి తృప్తిపరచేటందుకు వజ్రకాయుడి కిది చాలా మంచి



అవకాశంకూడా అయింది. వజ్రకాయుడితోబాటు అతని సేనలుకూడా యుద్ధరంగంనుంచి వైదొలిగాయి.

గ్రీకులపక్షాన ఇకమీదట యుద్ధం చేయనని వజ్రకాయుడు శపథం చేసినట్టు వినగానే ట్రోజనుల ఆనందానికి మేరలేదు. వారు ఎంతో ఉత్సాహంతో గ్రీకులపైకి బ్రహ్మాండంగా దాడి ఎత్తివచ్చారు. ఈ దాడి చూసి రారాజుకు గుండె చలించిపోయింది. యుద్ధవిరమణకోసం ఆయన ట్రోజనులకు వార్త పంపాడు.

యుద్ధం నిలుపు చేయబడింది. ఈ పోరాటమంతా భువనసుందరికోసమే గనక,



ఆమె ఎవరిది కావాలో నిర్ణయించటానికిగాను ఆమె భర్త అయిన ప్రతాపుడికీ, ఆమెను ఎత్తుకుపోయిన మోహనుడికీ మధ్య ద్వంద్వ యుద్ధం జరిగేటట్టు నిర్ణయించారు.

ప్రతాపుడూ, మోహనుడూ ద్వంద్వ యుద్ధం చేశారు. కాని ఇది అసాంతం నడవలేదు: మధ్యలోనే మోహనుడు మాయమయాడు. కామినీదేవత అతన్ని తన మాయాప్రభావంచేత అదృశ్యుణ్ణి చేసి ట్రోయ్‌కి చేర్చిందన్నారు.

ద్వంద్వయుద్ధం ఎటూ తేలకపోగా, యుద్ధవిరమణకు భంగంకూడా కలిగింది! కంటకుడు అనే ట్రోజన్ వీరుడు ప్రతాపుడిపై బాణం వదిలాడు. ఇది చూసి మండిపడి దేవమయుడు కంటకుణ్ణి చంపి, ప్రశంసనుణ్ణి గాయపరిచాడు.

ఇది జరిగిన అనంతరం వీరసింహుడు వజ్రకాయుణ్ణి తనతో ద్వంద్వయుద్ధానికి ఆహ్వానించాడు. కాని వజ్రకాయుడు తాను యుద్ధరంగంనుంచి విరమించుకున్నానని జవాబు పంపాడు. వీరసింహుడితో ద్వంద్వ యుద్ధం చేయటానికిగాను గ్రీకులు భూధవుణ్ణి ఎన్నుకున్నారు. ఎందుకంటే వజ్రకాయుడి తరవాత గ్రీకు వీరులలో చెప్పుకోదగిన మహావీరుడు భూధవుడే.





వీరసింహుడూ, భూధవుడూ సూర్యాస్త మయందాకా ద్వంద్వ యుద్ధం చేసినా ఒకరు ఓడటంగాని, ఒకరు గెలవటంగాని జరగలేదు. వారు సమ ఉజ్జీలుగా పోరాడారు. సూర్యాస్తమయం కాగానే వారు యుద్ధం నిలుపుచేసి, ఒకరి శౌర్యపరాక్రమాలను ఒకరు ప్రశంసించి, ఒకరికొకరు బహుమానాలుకూడా ఇచ్చుకున్నారు.

ఉభయపక్షాలూ తాత్కాలిక యుద్ధ విరమణకు ఒప్పుకున్నాయి. గ్రీకులు తమ యుద్ధనిహతుల నందరినీ పాతిపెట్టి, అక్కడ నిడుపైన దిబ్బ నిర్మించి, దానిమీద ఒక గోడ కట్టారు. ఈ గోడకు ముందుగా ఒక లోతైన కందకం తవ్వి, దాని ముందుగా ఒక కంచె అమర్చారు.

ఆ తరవాత తిరిగి యుద్ధం ఆరంభమయింది. ఈ యుద్ధంలో గ్రీకులు ఘోర పరాజయం పొందారు. ట్రోజనులు వారిని కందకంమీదుగా గోడ అవతలికి తరిమివేశారు. ఆ రాత్రి ట్రోజనులు సముద్ర తీరాన్నిచేరి, గ్రీకు నౌకలకు చాలా కొద్ది దూరంలోనే మకాంవేశారు.

గ్రీకు సర్వసేనాని అయిన రారాజు నిస్పృహ చెందాడు. ఏవిధంగానైనా వజ్రకాయుణ్ణి తిరిగి యుద్ధంలోకి రప్పించాలి.




లేకపోతే అపజయం తప్పదు. రక్తవర్ణుడు, భూధవుడు, రూపధరుడు, మరి ఇద్దరూ కలిసి రారాజు తరఫున వజ్రకాయుడి వద్దకు దౌత్యం వెళ్ళారు. వారి ద్వారా రారాజు వజ్రకాయుడికి అంతులేని బహుమానాలు పంపుతూ, "నీ భామినిని నువే తీసుకో! యుద్ధంలో వచ్చి చేరు!" అని వర్తమానం చేశాడు.

రారాజు భామినిని వజ్రకాయుడికి తిరిగి ఇస్తాననటానికి మరొక కారణంకూడా ఉన్నది. తండ్రిదగ్గిరికి పంపబడిన హేమ, "నేను ఇక్కడ ఉండను. రారాజుదగ్గిర నాకు చాలా సుఖంగా జరిగిపోతున్నది!"

అని తండ్రితో పోట్లాడి, రారాజువద్దకు తిరిగి వచ్చేసింది!

రారాజు దూతలతో వజ్రకాయుడు చాలా ప్రేమగానే మాట్లాడాడు, కాని తన నిర్ణయం మార్చుకోవటానికి అతను ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు. "రేపు ఉదయమే నేను నా నావలను తరలించుకుని దేశానికి తిరిగి పోతున్నాను!" అనికూడా అతను దూతలతో చెప్పాడు.

ఆ రాత్రే రూపధరుడూ, దేవమయుడూ కలిసి ట్రోజనుల శిబిరంపై దాడిచేయ తలపెట్టారు. వారా పనిమీద బయలుదేరి పోతూండగా దారిలో వారికి ట్రోజనులు పంపిన వేగులవాడొకడు తటస్థపడ్డాడు. ఇద్దరు గ్రీకువీరులూ వాడిపై బడి బలాత్కారంగా శత్రువుల రహస్యాలు బయటపెట్టించి, వాణ్ణి కాస్తా చంపేశారు.

వాడు ముఖ్యమైన రహస్యం ఒకటి బయటపెట్టాడు; అదేమంటే:

విచ్ఛేదనుడు అనే త్రేస్‌దేశపు రాజు అంతకు పూర్వమే తన సిబ్బందితోనూ, పాలమీగడలాటి తెల్లని రంగుగల మేలుజాతి అశ్వాలతోనూ వచ్చి ట్రోజన్ సైనిక శిబిరంలో విడిశాడు. ఆ గుర్రాలు వాయువేగాన్ని మించి పోగలవి. అవి ట్రోయ్



నగరంలో మేసి, ఆ నగరానికి దక్షిణంగా ప్రవహించే స్కామందర్ నదిలో నీరు తాగిన పక్షాన ట్రోయ్‌ని ఎవరూ జయించలేరని ఒక ప్రతీతి ఉన్నది. విచ్ఛేదనుడి గుర్రాలింకా ఈ రెండు పనులూ చేయలేదు. విచ్ఛేదనుడు ఆ రాత్రి ట్రోజను శిబిరంలో కుడిపార్శ్వాన ఒక డేరాలో మకాం చేసినట్టు గ్రీకువీరులు వేగులవాడి ద్వారా తెలుసుకున్నారు.

రూపధరుడూ, దేవమయుడూ వేగులవాణ్ణి చంపి, నేరుగా విచ్ఛేదనుడి డేరాకు వెళ్ళారు. గాఢనిద్రలో ఉన్న విచ్ఛేదనుణ్ణీ, అతని అనుచరులు పన్నెండు మందినీ



చంపారు. విచ్ఛేదనుడి వెంట వచ్చిన తెల్ల గుర్రాలను విప్పుకుని, విజయోత్సాహంతో తమ శిబిరానికి వెళ్ళిపోయారు.

తరువాత కొద్దిసేపటికి విచ్ఛేదనుడి పరిజనులు నిద్రలేచి తమ రాజూ, అతని అనుచరులూ వధించబడినట్టు తెలుసుకుని కంగారు పడి, వచ్చిన దారినే తిరిగి పారిపోసాగారు. గ్రీకులు దారి కాసి వారందరినీ తుదముట్టించారు.

ఇంత జరిగినా, గ్రీకులకు మర్నాడు యుద్ధభూమిలో మళ్ళీ అపజయమే ఎదురయింది. ట్రోజనులచేతిలో, అంతకు పూర్వం వారింత అపజయం ఎరగరని చెప్పాలి. యుద్ధంలో రారాజూ, దేవమయుడూ, రూపధరుడూ మొదలైన ముఖ్య వీరులందరూ గాయాలు తిన్నారు.

రణరంగాన సింహానికి ఏమాత్రమూ తీసిపోని ట్రోజను మహావీరుడు వీరసింహుడు గ్రీకులను తరిమికొట్టాడు. వారు నిర్మించిన గోడను ఛేదించాడు. అక్కడితో ఆగక అతను ఇంకా ముందుకు చొచ్చుకుపోయి గ్రీకు సైనికశ్రేణులనే భేదించాడు. గ్రీకు వీరులందరూ కలిసి విశ్వప్రయత్నాలు చేసికూడా వీరసింహుడి ధాటిని కొంచెం కూడా ఆపలేకపోయారు.

భూధవుడు విసిరిన గండశిల ఒకటి వీరసింహుడికి గురిగా తగిలి, క్షణంపాటు అతను పడిపోయినట్టే కనిపించాడుగాని, అంతలోనే మళ్లీ తేరుకుని తన సైనికులకు అంతులేని ఉత్సాహం కలిగించాడు.

చూస్తూండగానే ట్రోజనులు గ్రీకు నౌకలను చేరుకున్నారు. ఒక నావకు నిప్పు అంటించారు. ఆ నావ చంద్రప్రభుడిది. గ్రీకు నావలు ట్రోయ్‌తీరాన్ని చేరగానే అందరికన్న ముందుగా నేలమీదికి దూకి, అందరికన్న ముందుగా తన ప్రాణాలు కోల్పోయిన గ్రీకువీరుడు ఈ చంద్రప్రభుడే!

(ఇంకా వుంది)





# మోసగాళ్లు

ఒక దేశంలో ఇద్దరు మోసగాళ్లు ఉండే వాళ్లు. ఇద్దరూ సాధువులలాగా వేషాలు వేసుకుని ఊరూరూ తిరుగుతూ, భూత వైద్యాలు చేస్తామనీ, తాయెత్తులు కడతా మనీ చెప్పి, జనాన్ని మోసగించి డబ్బు సంపాదించి, తమ గుట్టు బయటపడేలోపుగా ఇంకొక గ్రామానికి వెళ్లిపోతూండే వాళ్లు. పెద్దవాడు గురువునని చెప్పుకునేవాడు, చిన్న వాడు శిష్యుడినని చెప్పుకునేవాడు.

ఈ దొంగసాధువులు ప్రజలను మోస గించేవాళ్లు గనక, వాళ్లు ఇవాళ ఉన్న ఊళ్లో రేపు ఉండకుండా, ఈ నెల ఉన్న దేశంలో వచ్చే నెల ఉండకుండా సంచారం చేస్తూ వచ్చారు. అయినప్పటికీ వాళ్ల అపఖ్యాతి వాళ్లను తరుముకుంటూ రాసాగింది.

గురుశిష్యులు ఒక ఊరు చేరేసరికి అక్కడ వారి మోసం ఎరిగినవాడొకడు తటస్థ పడ్డాడు. ఆ మనిషి వాళ్లను అటకాయించి, "మీరు దొంగలు! పచ్చిమోసగాళ్లు!" అని కేకలు పెట్టసాగాడు. వెంటనే పదిమందీ పోగయారు. వాళ్లకు అనుమానం కలిగింది; ఇద్దరినీ పట్టుకుని మెత్తగా తన్ని, ఊరినుంచి సాగనంపారు.

ఇలా జరగగానే గురుశిష్యు లిద్దరూ చెరొకదారీ అయిపోయారు. గురువుగారు చాలా రోజులు ప్రయాణంచేసి ఒక పెద్ద పట్టణం చేరుకున్నాడు. అక్కడ ఒక సత్రం అరుగుమీద చేరి, కళ్ళు మూసుకుని కొంత సేపు బకధ్యానం చేశాడు.

ఈ లోపుగా పనిలేని జనం చాలామంది చుట్టూ చేరారు. కొంత సేపటికి సాధువు కళ్ళుతెరచి చుట్టూ చేరినవాళ్లను చూసి చిరు నవ్వు నవ్వాడు.

"స్వామీ, తమరెవరు? ఎక్కడినుండి వస్తున్నారు? తమవద్ద ఏమి మహిమ లున్నాయి?" అని వాళ్ళు అడిగారు.

ఎస్. మాధవరావు

"మా చేతకాని దేమున్నది? విభూతి మంత్రించి ఇస్తే సమస్త వ్యాధులూ పోతవి! తాయెత్తు కడితే గ్రహపీడలు పోతవి! అన్ని రకాల గాలిచేష్టలు కుదుర్చుతాము!" అన్నాడు సాధువు, గడ్డం నిమురుకుంటూ.

చుట్టూ చేరినవారిలో కొందరు మంత్రించిన విభూతి తీసుకున్నారు. కొద్దిమంది తాయెత్తులు పుచ్చుకున్నారు. హరిద్వారంలో మఠం కట్టించటానికని చెప్పి సాధువు వారివద్ద కొంతడబ్బు వసూలు చేశాడు.

డబ్బు ఇవ్వాలనేసరికి తాయెత్తులు అడుగుదామనుకున్నవారు కొందరు అడగటం మానేశారు.

సరిగా ఈ సమయంలో శిష్యుడు అక్కడికి వచ్చాడు. తన గురువును చూశాడు. వెంటనే వాడు మండిపడుతూ, "మళ్ళీ ఇక్కడ దాపరించావా, దొంగ సన్యాసి వాడా?" అన్నాడు. తరవాత వాడు చుట్టూ చేరిన జనంకేసి తిరిగి, "అయ్యా, మీరెవరూ ఇతణ్ణి నమ్మకండి! వట్టి మోసగాడు! మొన్న మొన్నటిదాకా నేను ఈ మనిషికి శిష్యుణ్ణిగా ఉండి, ఇతను చేసే పాపంలో పాలుపంచుకున్నాను! నాకు బుద్ధి వచ్చింది! ఈ మనిషివల్ల మీరు మాత్రం మోసపోకండి! ఇతడి దగ్గిర ఎలాంటి మహిమలూలేవు," అని కేకలు పెట్టాడు.



ఈ మాటలను కొందరు నమ్మి ఆశ్చ ర్యంతో ముక్కుమీద వేలు వేసుకుని, "ఇంకా నయం! ఎంత మోసం! ఎంత మోసం!" అన్నారు.

గురువువద్ద అదివరకే తాయెత్తులూ, విభూతీ కొనుక్కున్నవాళ్లుమటుకు ఆయన కేసి తిరిగి, "ఎవడో దుర్మార్గుడు వచ్చి తమరిని ఇంతమాట అంటూంటే తమరు చూస్తూ ఊరుకుంటారేం? అనుమతి ఇవ్వండి, మెత్తగా తన్నేస్తాం!" అన్నారు.

గురువు గడ్డం నిమురుకుంటూ, "అజ్ఞాని! వాడిపాపం వాడికే తగులుతుంది! వాడిమీద చెయ్యిచేసుకోకండి!" అన్నాడు.

ఈ మాటతో శిష్యుడు మరింత రెచ్చి పోయి, గురువుకేసి తిరిగి, "ఆమాట అనక ఇంకే మంటావు? నీ బతుకంతా నాకు తెలుసును! ఎవరన్నా నన్ను అంటుకున్నారో, నీ గుట్టంతా బయటపెట్టేస్తాను!" అని మళ్లీ బిగ్గరగా అరిచాడు.

గురువు నిజంగా మోసగాడే అయి ఉంటా డన్న నమ్మకం అక్కడ చేరినవారికి కలగ సాగింది. కాని ఇంతలోనే గురువులేచి నిల బడి, "ఓరీ! నీవు మితిమీరి పోతున్నావు! ఈ అమాయకులు నీ మాటలు నమ్ముతా రని నీ ఉద్దేశం! కాని నిజం పలికేవాడు నిన్ను మించినవాడు భగవంతుడున్నాడురా,



మూర్ఖా! నేను దొంగనే అయితే ఈ కప్పు విరిగి నామీద కూలుగాక! నీ మాటలు అబద్ధమే అయితే ఇదుగో అనుభవించు!" అంటూ తన కమండలంలోనుంచి ఇన్ని నీళ్ళుతీసి శిష్యునిమీద చల్లాడు.

మరుక్షణం శిష్యుడు మొదలునరికిన చెట్టులాగా కిందపడి, కొద్దిసేపు గిలగిలా తన్నుకుని, శరీరం కొయ్యబారి శవంలాగా అయిపోయాడు.

"చచ్చాడు! చచ్చాడు!" అని నలుగురూ హాహాకారాలు చేశారు. "మహిమగల వాళ్లను నిందిస్తే ఊరికే పోతుందా?" అని కొందరన్నారు. "సామాన్యపు సాధువను కుని నోటికి వచ్చినదల్లా వాగాడు! రోగం వదిలింది!" అన్నారు మరికొందరు. "స్వామీ, తెలియక నేరం చేశాడు! వాణ్ణి క్షమించండి!" అని కొంతమంది గురువును బతిమాలారు. గురువు తన జోలెలోనుంచి ఒక తాయెత్తుతీసి శిష్యుడి చేతికి కట్టి, "నిన్ను క్షమించాము, లేవరా!" అన్నాడు. శిష్యుడు అప్పుడే నిద్రలేచినవాడిలాగా లేచికూచుని, చుట్టూ కంగారుగా చూసి, చివరకు గురువుకేసి చూసి ఏడుస్తూ ఆయన కాళ్లమీద పడి, "క్షమించండి, స్వామీ! తప్పుచేశాను," అన్నాడు.

"క్షమించాము, పోరా! ఇక ఎన్నడూ సాధువుల జోలికి రాకు!" అన్నాడు గురువు.

శిష్యుడు కళ్లు తుడుచుకుంటూ లేచి ఎటో వెళ్లిపోయాడు. తరవాత అక్కడ చేరిన వారందరూ గురువువద్ద తాయెత్తులు కొని బోలెడంత డబ్బు ఇచ్చారు.

అప్పుడు గురువు ఆ పట్టణంనుంచి బయలుదేరి కొంత దూరాన శిష్యుణ్ణి కలుసుకుని తాను సంపాదించిన డబ్బులో సగం వాడికి ఇచ్చేశాడు. మళ్లీ వాళ్లిద్దరూ చీలి ఇంకొక నగరానికి ప్రయాణమై, అక్కడ కూడా ఇదే నాటకం ఆడటానికి బయలుదేరి వెళ్లిపోయారు.





# మిత్రభేదం

ఈ ధైర్యమున రాజు - నింటిలో నుండ
బాధిత రాజులు - పై కొన్నవారు.
బిరబిర రాజ్యమ్ము - పెఱవారు గెలిచి
చరచర కోట చు-ట్టుర నిల్చినారు.
మాయ విష్ణువు నమ్మి - మన రాజు మటుకు
పాయని భక్తితో - పలుకక యుండె.
ఇక కోటనే ముట్ట-డించిన కలగి
సకరుణమ్ముగ కూతు-నకు చెప్పుకొనియె.
ఆమె రాతిరి నకి-లీ మహావిష్ణు
గోముగా వేడె, "నో-సామి కాపాడు.
పగవారు కోటనే - పట్టుకో గలరు
ముగిసిన వాహార - ముఖ్యవస్తువులు.
సైనికులెల్లను - క్షతగాత్రులైరి
వేనకువేలు యు-ద్ధాననే పడిరి.
మీరె కాపాడంగ - మిగిలినవారు
ఏ రీతి రక్షింతు-రో, రమారమణ?"
అని రాకుమారి వే-డిన మాయవేల్పు
మనసున తలపోసె - మఱి దారి లేక.

'ఏమైనగాని నే-నీ వేషమునవె
స్వామిగా గన్పడి - శత్రుల నణతు
నారాయణుండని - పోరుదు రెట్లు?
వారిని బెదిరించు - దారి యియ్యదియె.
కోరలలో విష-గుణము లేకున్న,
సారెకు పడగ ప్ర-సారించుచున్న
పామును జూచిన - భయపడగలరు;
పాము పటాటోప-మే మందు జగతి.
అని తెగించి యతండు – వనితకు చెప్పె
"అనికి ప్రొద్దున రాజు - నరుగ నిమ్మెను
గరుడునిపై నెక్కి - గగనమ్ము నుండి
పరసేన భంజించి - పారవైచెదను"
ఆ మాట తండ్రితో - ననె రాకుమారి
ఈమాఱు జయమని - యెగిరె నా రాజు.
బల్లు బల్లున తెల్ల-వారిన యంత
కల్లోలముగ పెద్ద - కదనమే అయ్యె.
మాయవిష్ణుడు వచ్చు - చాయను జూచి
ఈ యమాయకునితో - నేమగునంచు

విద్వాన్ విశ్వం



కరటకుడు :
సరిగాని, మేధావి - సంజీవకుండు
మఱి భయంకరుడును-మన మృగరాజు
వైరమ్ము కల్పింప - వలనెట్లు పడును ?
ఓరి నీ సామర్థ్య - మొక లెక్కయగునె?

దమనకుడు :
సామర్థ్యమునగూడ - సరిపడనట్టి
వీ మహి యుక్తితో-నే సరిపడును !
బంగారు తీగెతో - పాడుసర్పమ్ము
చెంగించె మును కాకి - చెప్పగా వినమె !

కరటకుడు :
ఆ కథ ఏమిటి - అది యెట్లు జరిగె ?

దమనకుడు :
ఆ కాకి కథ విను-మన్న చెప్పెదను.

కాకీ పామూ కథ

ఒక మఱ్ఱిచెట్టుపై - నుండెను మున్ను
ఒక జత కాకు లె-న్నో యేండ్లనుండి.
ఆ చెట్టు తొఱ్ఱలో - సంతట నొక్క
త్రాచుబాముసు కాపు-రమ్మును బెట్టె.
కాకి గ్రుడ్లను బెట్ట-గా పాము వచ్చి
చీకటిలో తిని - చెరచెర పోవు.
కారుకారున నిట్లు - కలిగిన సంతు
దారుణమ్ముగ తిని - తరలుచు నుండె.
ఎన్నాళ్ళు పాము పో - రిటు భరించెదము?
కన్న బిడ్డల బలి-గా నివ్వగలము ?

అసలు విష్ణువు తన - అధికారమెల్ల
పస లేనిదగు వీడు - పడిపోయినంత
జనమున నా భక్తి - సమసిపోగలదు
మన మూరకుండుట - మర్యాదకాదు
అని విష్ణుడే వచ్చి - ఆ శత్రువులను
తునుమాడె వాని రూ-పున లోన దూరి
వైరిరాజులు పారి - పారి పోవంగ
శూరుడు దిగి వచ్చె - ధారుణీస్థలికి
జరిగిన కథయెల్ల - జనులకు చెప్పె
వర బుద్ధిశాలిగా - వారును మెచ్చ
రాజు కూతు నొసంగి - రాజ్యమ్ము నిచ్చి
పూజించె వాని దే-వుని బుద్ధి యనుచు.
కావున కరటకా - కావలె బుద్ధి
ఏ విధమ్ముననైన - నెటు గెల్వవచ్చు ?

అని కాకిజంట న-క్కను జేరి అనియె
మను చెట్టు కొంపలో-ననె పాము జేరె.
నక్క ఆ మాటకు - నవ్వుచు, వట్టి
తెక్కబాగులదాన ! - దిగు లొందబోకు.
కత్తితో కానట్టి - కార్యాలుగూడ
కొత్త ఉపాయాన - కుదురుకోవచ్చు.
అని ఒక్క పని సేయు - మని చెవిగొఱుక
చనె కాకిజంట చెం-తనె గల పురికి.
కొలనులో దిగి రాజ-కుల కాంతలెల్ల
చెలగి జలక్రీడ - సలుపుచున్నారు
గట్టున తమదు న-గానట్రు, తీసి
పెట్టినా, రది చూచె, - బిరబిర కాకి.
చక్కని బంగారు - సరమును తాను
ముక్కున గఱచుక - మురియుచు నరిగె.
తటుకున నా రాజ-భటు లది చూచి
బటువైన కఱ్ఱల - పట్టుక వచ్చి
కాకి వెంబడి బడ-గా సంతసించి,
కాకి, చెట్టును జేరి - కనకసూత్రమ్ము—
పామున్న తొఱ్ఱలో - పడవేసి చనియె
ఆ మనుష్యులు చూచి-నా రది తాము.
వెంటనే తొఱ్ఱలో - వెదుక దొడంగి
తుంటరి పాము కం-దోయిని బడిన
తుంట కట్టెల దాని - తుదముట్ట గొట్టి
ఇంటికి సొత్తుతో - నేగిరి వారు.



పాము పీడ తొలంగి - పరితృప్తి నొంది
వేమారు పొగడె నా - వెఱ్రి కాకములు.
అంతట తెలివితో - నగు నన్ని యనుచు
సంతసమ్మున నక్క - సరి కొత్త కథను
వినుమంచు కాకిజంటను జూచి చెప్పె
'అనగనగంగ ఒక్క - డవి' అటంచు

కొంగ యెండ్రి కథ:

కానలో నొక కోన కల - దందులోన
వేనకువేలుగా - వెలసె జీవములు.
చేపలు, కప్పలు, - చేట తాబేళ్ళు,
ఆ పీతలును మొద-లగునవి చాల గలవు.
మడుగు గట్టున నొక్క - బడుగు కొంగొకటి
నడయాడుచును నుండె - నొడలెల్ల చిక్క.

చేపల బట్టగా - చేవయూ లేదు ;
ఏపగిదిని పొట్ట - కిక వచ్చు తిండి.
తలపోసి తలపోసి - మెలమెల్ల వచ్చి
జలముదగ్గఱ నిల్చి - వలవల యేడ్చె.
పీత ఒక్కటి దాని - పెనువగ జూచి
ఆతగానిని జేరి - అడిగె మెల్లగను.
'ఓ కొంగమామ! ఓ-హెూ కొంగమామ
ఈ కరణిని ఏడ్తు - విది యేలనయ్య!
తిండి తిప్పలు లేక - ఉండుట యేల?
నిండు కన్నీళ్ళేల ? - ఎండిపో నేల ?'
అనినంత తన ఉపా-యము పారెనంచు
వినయ ముట్టిపడంగ - అనియె నా కొంగ :
"నిజము కన్గొంటివి - నిజము, నాయన్న,
అజవజ లేని స-న్యాసిని నేను.
నిరశన వ్రతమును - నే పట్టియుంటి
కొఱకను చేపల - కోరికల్ చచ్చె.
ఇక్కడే పుట్టి నే - నిక్కడే పెరిగి
ఇక్కడే ముసలినై - ఇట చావ నుంటి.
ఏడ్చు టేలందువా ? - ఏమని చెప్ప—

మాడ్చివేయగ నుండె - మహా పెద్ద కరువు.
రేపు మాపటనె పం-డ్రెండేండ్ల కరువు
ఈ ప్రాంతమంతయు - నేడ్పించునంట.
ఈ వార్త జ్యోతిష్కుడే-అన వింటి
కావుననే ఇంత-గా ఏడ్చుచుంటి.
ఈ మడుగా చిన్న - దే మనవచ్చు
ఈ మట్టుకే జల - మిందులో తగ్గె.
కరువు వచ్చిన నింక - గతి ఏమి కలదు ?
బిరబిర నీ రెండి - బీటలువారు.
నా పుట్టినింటి కెం-తటి కీడు మూడె
పాప మెచ్చట నున్న - ప్రాణులు చచ్చు.
చుట్టుపట్టుల నున్న - చిట్టి గుంటలను
పుట్టినవెల్ల అ-ట్టిట్టు పోయెడిని ;
పెదపెద్ద మడుగుల - విడియుచుండెడిని.
పదరక మీరేమొ -పడియుంటి రిచట.
కడ కొక్క నలుసైన - కానరాకుండ
బుడనాశనమ్మౌను - కడకు ఈ గుంట.
విలపించుచుంటి నీ - విషయ మెఱింగి
ఫలమేమి " అని కొంగ - వలవల యేడ్చె.



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1957 ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అందఱు కలసీ దండుగ వెళితే...

రెండవ ఫోటో : ఆహారానికి లోటే లేదు!

పంపినవారు : పి. చిననన్యాసిరావు, VI ఫారం, A/S. H. B. H. స్కూలు, అలమూరు (జొన్నాడ) రామచంద్రపురం తా॥ (తూర్పుగోదావరి జిల్లా)

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# తాబేళ్లు

సరీసృపాలలో మూడు రకాలను మనం తరుచు చూస్తాం. వాటిలో తాబేళ్లు ఒక రకం; మొసళ్ళు మరొకరకం; బల్లులూ, పాములూ మూడోరకం.

తాబేళ్లకు శరీరాలమీద కవచం ఉంటుంది—మరే సరీసృపాలకూ ఇలాటి కవచంలేదు. కొన్ని తాబేళ్లు అపద నుంచి తప్పించుకోవటానికి తలనూ, కాళ్లనూ ఈ కవచంలోకి లాగేసుకుంటాయి.

తాబేళ్లలో నీటితాబేళ్లనీ, మెట్టతాబేళ్లనీ రెండు రకాలు. నీటితాబేళ్లలో మళ్లీ రెండు రకాలున్నాయి. కొన్ని బావులలోనూ, చెరువులలోనూ మాత్రమే ఉంటాయి; ఇవి మంచినీటి తాబేళ్లు. మరికొన్ని సముద్రాలలో మాత్రమే ఉంటాయి; ఇవి ఉప్పునీటి తాబేళ్లు.

బావులలోనూ, చెరువులలోనూ ఉండే తాబేలు ఊపిరితిత్తులతో గాలి పీల్చే జంతువు. అందుచేత అది అప్పుడప్పుడూ గాలి పీల్చటానికై నీటిపైకి రావాలి. అయితే, చిత్రమేమంటే, అది తలను నీటిలో ముంచితేగాని ఆహారాన్ని గుటక వెయ్యలేదు.

తాబేళ్లకు దంతాలుండవు. కాని నీటితాబేళ్లలో కొన్నింటికి దవడలు ఎంత పదునుగా ఉంటా యంటే, అవి మనిషి వేలిని సులువుగా కొరికెయ్య గలవు.

తాబేటి నడక జగత్ప్రసిద్ధమైనది. తాబేళ్లు వేగిరం నడవలేవు, కదలలేవు. కాని అవి చాలా ఏళ్లు బతుకుతాయి. తాబేళ్లలో చాలా భారీ అయినవి ఉన్నాయి. వీటి బరువు 500 పౌనులుకూడా మించుతుంది. ఇవి నూరేళ్ల పైగా జీవిస్తాయి. వీటిపైన మనిషి ఎక్కి సవారీ చేయవచ్చు.

భగవంతుడెత్తిన అవతారాలలో మహా కచ్ఛపం అవతారం ఒకటి.

సముద్రపు తాబేళ్లు ఎల్లప్పుడూ నీటిలోనే ఉంటాయి; గుడ్లు పెట్టటానికి మాత్రమే ఇవి నీరు విడిచి నేలమీదికి వస్తాయి. వీటిని ఆకుపచ్చ తాబేళ్లంటారు. వీటి కాళ్లు ఈదటానికి పనికి వచ్చే తెడ్లలాగా ఉంటాయి. వీటిని ఆహారంగా ఉపయోగిస్తారు. ఒక్కొక్క ఆకుపచ్చ తాబేలు 400 పౌనుల బరువుండి చాలామందికి ఆహారమవుతుంది.

అన్ని సరీసృపాలలాగే తాబేళ్లు గుడ్లు పెడతాయి. సముద్రాలలో ఉండే ఆకుపచ్చ తాబేలు సముద్రతీరాన ఇసకలో గుంట తవ్వి, గుడ్లుపెట్టి, తిరిగి గుంటను పూడ్చి, సముద్రంలోకి వెళ్లిపోతుంది. ఇసకలో తాబేలు గుడ్లకు అవసరమైన వెచ్చదనంతోబాటు చెమ్మకూడా లభిస్తుంది. గుడ్లు పొదిగి పిల్లలు బయటికి రాగానే అవి గెంతుకుంటూ సముద్రంకేసి వస్తాయి. కొన్నిటని పక్షులు తన్నుకుపోతాయి. నీటిని చేరుకోగలిగినవి దక్కుతాయి.




ప్రొఫెసర్ పి. సి. సర్కార్

గడియారాన్ని మాయంచేసే ఇంద్రజాలం చాలా తమాషాగా ఉంటుంది. రెండేళ్ల క్రితం నేను జర్మనీ వెళ్లినప్పుడు నా మిత్రులొకరు తన గడియారాన్ని అదృశ్యం చెయ్యమని కోరారు. ఒకసారి అతడొక ఐంద్రజాలికుని ప్రదర్శనలు చూడటానికి వెడితే, ఆ ఐంద్రజాలికుడు తన గడియారాన్ని మాయం చేసి, దాన్ని మళ్లీ అతడొక నాన్‌రొట్టెలోంచి పైకి తీశాడట.

ఈ తమాషాని ఇంత నిర్దుష్టంగాచేసి చూపిన వాళ్లని. అతడు జీవితంలో ఎన్నడూ చూసి యెరుగడట! దానికి నాలో నేను నవ్వుకుని, 'మా దేశంలో All India Magicians Club అనేది ఉంది. అందులో అయిదు వందలమంది సభ్యులున్నారు. వాళ్లందరూ ఈ తమాషాచేసి చూపగలవారే' అని చెప్పాను. అతడు నమ్మలేదు. పైగా తన గడియారాన్ని అలా ఎవరైనా మాయం చెయ్యగలిగితే వాళ్లకి తన గడియారాన్ని ఇచ్చేస్తానని పందెంకూడా వేశాడు. నేను ఇరకాటంలో పడ్డాను. రంగస్థలంమీదనయితే ఈ గడియారాన్ని, దీని యజమానిని, అతడి కారునీ కూడా నిమిషంలో మటుమాయం చేయగలను. కాని మిత్రుని యింట్లో ఏ సాధన సంపత్తీ లేకుండా, నలుగురి యెదుటా ఎలా మాయం చెయ్యటం? నేను గడియారాన్ని పరిశీలనగా చూశాను. ఇవాళ కాదు, ఎల్లుండి రాత్రి భోజనాల సమయంలో చేసి చూపుతానన్నాను.

ఆ రోజున అతడిహ నన్ను గేలిచెయ్యటం మొదలెట్టాడు. ఏదీ గడియారం ఇమ్మని అడిగి తీసుకుని, ఇది మాయం చెయ్యటం పెద్ద విద్యేంకాదు అన్నాను. నేను నా జేబులోంచి రుమాలు బయటికి తీసి, చిత్రంలో చూపినట్లు దాని నాలుగు అంచులు కలిపి పట్టుకుని - సంచిలాగా ఉన్నదాంట్లో ఆ గడియారాన్ని అందరియెదుటా వేశాను. అది ఆ రుమాలులో ఉన్నట్లందరూ చూశారు. తర్వాత గడియారంతోసహా ఆ రుమాలును ఒకరి చేతికిచ్చాను. దాన్ని తడిమిచూసి అతడందులో గడియారం ఉన్నదని చెపుతూ గట్టిగా పట్టుకున్నాడు. తర్వాత నేనా రుమాలును అందుకుని, ఒకవైపు పట్టుకుని దులిపాను. - గడియారం మాయమైపోయింది.

ఇహ దాన్ని నాన్‌రొట్టెలోంచి బయటికి రప్పించాలి. నేను రొట్టె తెప్పిస్తానని అందరూ అనుకున్నారు. కాని ఆ గడియారం నాచేతిని మణికట్టువద్ద కట్టి ఉండటంచూసి-అందరూ విస్తుపోయారు. నేనా గడియారాన్ని చేతి నుంచి విప్పితీసి చూపించాను. అది అక్షరాలా అతడి గడియారమే. ఆ మిత్రుడి ముఖం సిగ్గుతో కందగడ్డయింది. మాట్లాడలేక పోయాడు. అన్నమాట ప్రకారం ఆ గడియారాన్ని నాకిచ్చేశాడు.

ఇప్పుడిందులో కిటుకు చెపుతున్నాను. చెక్ డిజైన్‌లో ఒకేరంగు జేబురుమాళ్లు రెండు తీసుకుని నాలుగు వైపులా చక్కగా దారాలతో కుట్టుపని చేయించాలి. అది చిత్రంలో స్పష్టంగా చూపబడింది. నాలుగు వైపులా కుట్టుపని కన్పిస్తుంది. కాని ఒక మూల మాత్రం చిన్న ఖాళీ ఉంచాలి—తలగడ సంచికి దూది పెట్టటానికి ఓ మూల ఖాళీ ఉంచినట్లు-అలా ఒక వైపున 'A' గుర్తున్న చోట ఖాళీ ఉంచాలి. అప్పుడు రుమాలు డబుల్ రుమాల అయి, 'A' గుర్తున్నచోట ఖాళీ యేర్పడటంతో సంచిలా అవుతుందన్న మాట. రుమాలు నాలుగు అంచులూ కలిపి పట్టుకోవటంతో ఆ 'A' గుర్తున్న ఖాళీ ఒక వైపుకు వస్తుంది. ఆ గడియారాన్ని ఈ ఖాళీ లోంచే సంచిలోకి జారవిడవాలి. చూసే వారికిదంతా ఏమీతెలియదు. వారు అది ఒకే రుమాల అని, అందులోనే గడియారం ఉందని అనుకుంటారు. ఇప్పుడా డబుల్ రుమాలుని ఒకవైపు పట్టుకుని విదిలిస్తే లోపల గడియారం ఉన్నట్లు పైకికన్పించదు.

ఇంద్రజాలికుడు రుమాలును దులిపి, గంభీరంగా ముఖం తుడుచుకుని, దాన్ని జేబులో పెట్టుకుంటాడు. దాంతోపాటు గడియారంకూడా జాగ్రత్తగా జేబులోకి వెళ్ళిపోయిందని వేరే చెప్పనక్కర్లేదు. అంచేతే అందరి యెదుటా గడియారం మాయమైంది. నేనప్పుడు గడియారాన్ని మాయంచేసిన పద్ధతి ఇదే. మొదట నేనతని గడియారం చూసి, రెండో రోజున సరీగ్గా అలాంటి గడియారాన్ని సంపాయించి ఈ తమాషాచూపటానికి సంసిద్ధుణ్ణయాను. ఈ తమాషా చేసేటప్పుడు-మిత్రుని



గడియారాన్ని చేతికి కట్టుకునే, డూప్లికేట్ గడియారాన్ని రుమాలులో వేసి మాయం చేశాను. ప్రేక్షకులకి అసలు ఈ రెండో గడియారం సంగతే తెలియదు. అంచేత వారికి అనుమానమే కలగలేదు. తర్వాత చేతినున్న గడియారం చూపించినప్పుడు వారికి సందేహం కలగటం సహజమే. కాని అసలు అది వారి గడియారమే అవటంవల్ల నా ఇంద్రజాలం జయప్రదంగా నెరవేరింది.



# వార్తలు-విశేషాలు

దేశంలో కొత్తగా మరి 22 కాగితం తయారుచేసే ఫ్యాక్టరీలను నెలకొల్పటానికి కేంద్ర ప్రభుత్వం అనుమతి యిచ్చింది. వీటితోపాటు, ప్రస్తుతం వున్న 21 కాగితం ఫ్యాక్టరీలు కలిసి, ద్వితీయ పంచవర్ష ప్రణాళికకాలం ముగిసేసరికి సాలుకు 5.4 లక్షల టన్నుల కాగితం ఉత్పత్తి చేయగలవు.

* * * *

ఫిలిమ్ డివిజన్‌వారు, 'క్రూర కీటకాలు' అనే పేరుతో ఒక డాక్యుమెంటరీ చిత్రాన్ని తయారు చేశారు. భారతదేశంలో ఎలుకలు, మిడతలు, తదితర కీటకాలవల్ల, ఏటా 500 కోట్ల రూపాయల పైరుపంటలు నష్టమౌతున్నవి.

* * * *

ఈ యేడు విజయవాడ రేడియోకేంద్రంలో నెలకొల్పబడిన 20 కిలోవాట్ల ట్రాన్స్‌మిటర్ ప్రారంభోత్సవ సందర్భంలో—రేడియో, సమాచారశాఖా మంత్రి డాక్టర్ కేస్కర్ సందేశమిస్తూ, వచ్చే ఏడాదిలో హైదరాబాదులో మరొక శక్తిమంతమైన ట్రాన్స్‌మిటరును ప్రభుత్వం నెలకొల్ప దలచిందని ప్రకటించారు.

* * * *

రైలు పట్టాలమీదగాని, మామూలు రోడ్డుమీదగాని వేగంగా ప్రయాణం చేయుగల కొత్తరకం శకటం ఈ 1957 లోనే తయారు కాగలదని, అమెరికాలో రైలుపెట్టెల నిర్మాణానికి పేరు పొందిన ఒక కంపెనీ ప్రకటించింది.



ఇండియాలో నెలకొల్పబడిన తొలి యాటమిక్ రియాక్టర్‌ను పండిట్ నెహ్రూ ఆవిష్కరిస్తూ, దానికి 'అప్సరస' అని పేరుపెట్టారు.

* * * *

సిరియా ప్రెసిడెంటు షుక్రీ ఎల్-కువాట్లీ జనవరిలో మన దేశానికి వచ్చి, ముఖ్య ప్రదేశాలలో పర్యటన చేశారు. భాక్రా-నాంగల్ ప్రాజెక్టు సందర్శించి, 'మొత్తం ప్రపంచంలోని ఇట్టి ప్రాజెక్టులలో దీని కిదే సాటి' అని మెచ్చుకున్నారు.

* * * *

ఇండియా, చైనాల ప్రధానులు నాంగల్‌నుంచి న్యూఢిల్లీకి తిరిగివస్తూ, స్పెషల్ ట్రెయిన్‌లోనే నూతన సంవత్సరాది పండుగ జరుపుకొన్నారు. డైనింగ్ కారులో రంగురంగుల కాగితపు తోరణాలతో, కొవ్వత్తులతో అలంకారాలు చేయబడినై.

* * * *

ఈ జనవరి మొదటివారంలో 62వ కాంగ్రెసు మహాసభలు ఇండోర్‌లో జరిగినవి. ఈ ప్రదేశానికి ఝాన్సీ లక్ష్మీబాయ్ స్మరణార్థం 'లక్ష్మీబాయ్‌నగర్' అని పేరుపెట్టారు. స్వాతంత్ర్య సమరంలో ప్రాణం విడిచిన వీరుల స్మారకచిహ్నంగా ఒక 'అఖండ జ్యోతి' ఊరేగింపబడింది.

* * * *

భారతీయ మహాకవి అయిన కాళిదాసుని ఉత్తమరచనల సంపుటి రష్యాలో వెలువడింది. ఇందులో—మాళవికాగ్ని మిత్రం, శాకుంతలం, విక్రమోర్వశీయ నాటకాలూ, మేఘసందేశ కావ్యమూ ఉన్నాయి.

* * * *

జపాన్ ప్రభుత్వం భారతదేశానికి 300 చెర్రీపండ్ల మొక్కలను బహూకరించింది. ఇవి సిమ్లాలోని హిమాచల్ ప్రదేశ్ బేసిక్ వ్యవసాయ పాఠశాలకూ, గోధుమ పరిశోధన కేంద్రానికీ, నైనితాల్‌లోని రాజ్‌భవన్ తోటలకూ పంపబడినై.



# చిత్రకథ





ఒకనాటి రాత్రివేళ, దాసూ, వాసూలు నిద్రపోతూండగా, పక్క గదిలో పెట్టెబేడా ఎవరో తెరుస్తున్న శబ్దమైంది. 'దొంగలా వుంది, ఏం చేయాలి?' అన్నాడు వాసు భయపడుతూ. 'వాడు, దొంగే! వాడిదగ్గిర కత్తికూడా వుంటుంది,' అంటూ దాసు దుప్పటి ముసుగుపెట్టుకున్నాడు. 'టైగర్' బయటికి వచ్చి, బీటు కానిస్టేబిలు దగ్గిరకు వెళ్లి మొరగసాగింది. కానిస్టేబులు, 'టైగర్' వెంట వెళ్లి, దొంగను పట్టుకున్నాడు. తరవాత, పోలీసు ఇనస్పెక్టర్ 'టైగర్'ను మెచ్చుకుంటూ, 'దాసూ వాసూలకన్న, యిదే చాలా ధైర్యంగలది!" అన్నాడు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'

# జలుబుకు ప్రథమ చికిత్స రాజు తెలుసుకున్నాడు!











ఆ రాత్రి రాజు పడుకున్నపుడు గుండెల మీద, గొంతుకు, వీపుమీద ఘాటైన విక్స్ వేపోరబ్ ను రాజు తల్లి రుద్దింది. వెంటనే రాజు జలుబు తగ్గడం ప్రారంభమయింది.







1. విక్స్ వేపోరబ్‌ను రుద్దిన వెంటనే రాజు చర్మ రంధ్రాలగుండా ఘాటైన ఆ మందు లోపలికిపోయి పనిచేయడం ప్రారంభించింది. గుండెలలో నొప్పిని తొలగించి, చిక్కబట్టిన పడిశాన్ని పలచ బరిచింది.




2. అందుతోపాటే రాజు నిద్రపోతూ వుండగానే అతడు ఊపిరి పీల్చి, విడిచేటప్పుడు శ్వాస నాళాలలోనికి ఘాటైన విక్స్ వేపోరబ్ వాసనపోయి పడిశాన్ని పలచపరిచింది. విక్స్ వేపోరబ్ వాసన జలుబును వెంటనే తగ్గిస్తుంది. బిగవేసిన రాజు ముక్కులను సడలించి, గొంతు నొప్పిని తీసివేసి, దగ్గును ఉపశమింప జేసింది.










VR-3307-

Photo by D. I. Chanthamian



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆహారానికి లోటే లేదు!

పంపినవారు:
పి. సి. సన్యాసిరావు - ఆలమూరు

